శ్రీః

# కన్నకూతురు

[సాంఘిక నాటకం]



యిత :

రసింహమూర్తి

ద ప్రచారక్

తోలేరు.

894.8272-4
N164K

# * సర్వోదయ నాటకపాత్ర పరిచయగేయం *



1. సర్వోదయనాటకమును, తిలకించుచు నాలింపుడు ఇందు పాత్రలెవరో!
   వివరించెదము గా ||సర్వో||

2. ఇతడు కథానాయకుడు, సుధాకర రాయాభిధుండు సర్వోదయ
   కార్యకర్త, సత్యాహింసావ్రతుండు ||సర్వో||

3. ఈమె జయశ్రీ శుభాఖ్య, భారతనారీలలామ, సంఘము సేవించి,
   పూర్ణసఫలతగైకొన్న మిన్న ||సర్వో||

4. లక్ష్మీపతి యితడు, స్వార్థపరాయణుడు, కంట్రాక్టరు, అధికారుల
   నండ ధనము నార్జించిన మహాశయుడు ||సర్వో||

5. అప్పన్న యితండు, నిజాయతీపరుడు, కష్టజీవి, సత్యవాది, సర్వ
   సముడు, స్వామిభక్తి పరాయణుడు ||సర్వో||

6. రామభక్తి పరాయణుడు, రామదాసు యితని పేరు, చీమనుసహితము
   త్రొక్కని దయామయుడు రైతురాజు ||సర్వో||

7. లక్ష్మీపతి మేనల్లుడు, యితనిని శేఖరం రందురు ఆంగ్లవేషభాషారతి,
   నర్తకీపతితు, దమాయకుడు ||సర్వో||

8. చిదంబరం వీనిపేరు, చేదుపుచ్చకాయి, యితడు, పశుతుల్యుడు,
   పాపాత్ముడు, భార్యాహంతకుడు, ద్రోహి ||సర్వో||

9. రక్షణ శాఖాధికారి, శిక్షాస్మృతి జదివి, యితడు తల్లిపాలంత్రావి,
   రొమ్ముగ్రుద్దుచున్న గుణహీనుడు ||సర్వో||

10. రక్షకభటుడయ్యు, వీడు, భక్షకభటుడై మెలగుచు చేతులనాకే వీధుల
    మూతులనాకే మూఢుడు ||సర్వో||

శ్రీః

# కన్నకూతురు

[సాంఘిక నాటకం]



రచయిత:

ఆముజాల నరసింహమూర్తి

హిందీప్రచారక్

తోలేరు.

(వెల రు 2-0-0

# మాతృశ్రీకి అంకితము



శ్రీయుతసచ్చరిత్రయు, వశిష్టసగోత్రయు, నాముజాల నా
రాయణ ధర్మపత్నియు, జనాదృతిపాత్రయు, సైనయుప ని
ర్మాయకు, సచ్చమాంబికకు, మాజనయిత్రికి, నంకితంబుగా
నాయనుంగుంగుమారిత యనంపగు నీ కృతి నిత్తుభక్తిమై.

# మనవి



నా యీ "కన్నకూతురు" బాల్యాత్ప్రభృతి పవిత్ర భారతీయత నుగ్గుబాలతో నలవరచుకొని, నాటక రచనావిశారదులు, కళాకారులు, విమర్శకులు, సహృదయులునగు నా మిత్రులు మద్దాల బాలాజీరావు (వీరవాసరం) పోలిశెట్టి రంగనాయకులు (కొప్పర్రు) ఇర్రింకి నారాయణ స్వామి (తోలేరు) కమ్మగపుర్తు శంకరరావు (వి. యమ్. శంబరదీవి) గార్ల వాగ్భూషణ భూషితురాలై పరిణయమునాడు మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమ, ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవి, బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారి యాశీస్సులను బడయఁగలిగి యింకను అనేక కవి, గాయక, పండిత నటీనటుల మన్ననలనందుకొనిన యదృష్టవంతురాలు.

ఈమె చరిత్ర యే సంస్థనుగాని, వ్యక్తినిగాని వుద్దేశించి రచింపఁబడినది కాదనియు, స్వకపోలకల్పితమనియు విన్నవించుకొనుచున్నాను.

ఈమె భావి భాగ్యోదయానికి దోహదమిచ్చిన మిత్రులకు, ప్రథమమున నాశీస్సులఁ బ్రసాదించిన కవిసార్వభౌములకు, సమీక్షలు వ్రాసిన ఆంధ్రదైనిక పత్రిక (మద్రాస్) దేశబంధు (నరసాపురం) సంపాదకులకు సినీమా సంపాదకులకులగు ఇంటూరి వెంకటేశ్వరరావు (మద్రాసు) గార్కి— ప్రథమ ప్రదర్శనమునఁ బాల్యాని ప్రజాహృదయములఁ జూరగొనిన శ్రీ మురళీకృష్ణ నాట్యకళాసమితి (వీరవాసరం) వారికి మరియు తన్నిర్వాహకులకు, ముఖ్యముగాఁ బెక్కుప్రదర్శనములిచ్చి ప్రేక్షకులనుఱ్ఱూతలూగించుచూ నటించిన శ్రీ మిత్రకళా సమితి (కమ్మరపుర్తుపాలెం) వారికి తన్నిర్వాహకులగు కాశీభొట్ల వెంకటసుబ్బారావు గారికి నాహృదయపూర్వక నమోవాకములు.

రచయిత.

# ఆశీస్సు

ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవి బ్రహ్మశ్రీ
శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలవారు

కన్నకూతురు — ఇదియొక సాంఘిక నాటకము. తన కన్న కూతురిని తండ్రి తానే పెండ్లియాడుటకు ప్రయత్నించుట ప్రధానము చేసికొని యిది రచింపఁబడినది. నేటి జనుల అభిరుచినిబట్టి కాలమునను సరించి సహజ కథావస్తువుతో నిది వ్రాయబడినది.

ఇందు వృద్ధుడయిన శ్రీహరిరావు రెండు వివాహములు చేసికొని విషయవాంఛాతృప్తుఁడు కాకపోవుటయే కథాంశము.

కథానాయకుడైన అమర్‌నాథ్ ఆ రావునకు మేనల్లుడు. గొప్ప ధనవంతుని బిడ్డయై బాల్యమందే తలిదండ్రులను గోల్పోయి మేనమామ యింట పెరిగినవాఁడాయెను.

రావుగారి ద్వితీయభార్యతో జెలికత్తెగా తనయింటికివచ్చిన సత్య వతిని కూడా గాంధర్వవిధిని వివాహమై తుదకేదో దుర్బుద్ధివలన గర్భవతి యైన యామెను పుట్టింటికి పొమ్మని, కాదనఁగా చంపుటకుకూడా ప్రయ త్నము చేసెను. పాపమామె తప్పించుకొని యెట్లోయొక స్వామి యాశ్ర మముఁజేరి బిడ్డను కనినది. ఆ బిడ్డ ధర్మయ్యయను రైతునింట పెరిగినది. ఆమెయే కథానాయిక. పేరు ప్రభావతి. రావు ఆ ప్రభావతినిగూడా చతుర్థ వివాహము జేసికొనఁదలఁచి. తుదకు తన కన్నకూతురని తెలిసికొని పశ్చాత్తప్తుడై తన మేనల్లుడు, కథానాయకుఁడు నయిన అమర్‌నాధున కిచ్చి పెండ్లిచేసినాడు. యిదియే యింపలి కథ.

ఇప్పటివారి అభిప్రాయానుసారముగా నిట్లు కథ కల్పింపఁబడినది. కాని నాటక నియమములు స్వీకరింపఁబడలేదు.

లోకోక్తులతో, సూక్తులతో ఈనాటకము నాటకరంగమునకు, సినిమా రంగమునకుకూడా మనోరంజకముగా నుండునని టకు సందేహము లేదు.

ఈ గ్రంథకర్త శ్రీఆముజాల నరసింహమూర్తికవి యితోధికముగా నభ్యుదయ రచనలను జేయుచుఁ బ్రజల మన్ననలకుఁ బాత్రుడై సుచిరాయు రుదార వైభవముల నలరారుగాక !

రాజమండ్రి
0—10—57

ఇట్లు,
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి (ఆస్థానకవి.)

# సమీక్షలు

కన్నకూతురు — నేటి నాటక ప్రేక్షకలోకానికి అనువుగా వుండ వలయునని సంస్కార భావప్రధానంగా వ్రాసిన పది దృశ్యముల సాంఘిక నాటకం.

స్త్రీవ్యసన పరాయణుడైన ఒక స్థితిమంతుడు చివరకు తన కన్న కూతుర్నే చతుర్థవివాహం చేసుకొనడానికి ప్రయత్నించడం, అనంతరం విషయం గ్రహించి ఆ ప్రయత్నం విరమించి పశ్చాత్తాపపడటం యిందలి ప్రధాన ఇతివృత్తం.

శ్రీహరిరావు అనే పెద్దమనిషి తన రెండవ పెండ్లాముతో చెలికత్తెగా వచ్చిన సత్యవతినికూడా గాంధర్వవిధిని వివాహమై ఆమె గర్భవతికాగా ఎలాగైనా ఆమెను వదలించుకొనడానికి ప్రయత్నించి విఫలుడై చివరకు ఆమెను కడతేర్చడానికికూడా ప్రయత్నిస్తాడు. ఏమయినాసరే! అతడే తన భర్తయనే భావముతో వున్న ఆమె యెలాగో తప్పించుకుని ఒక సర్వోదయస్వామి ఆశ్రమంచేరి బిడ్డను కంటుంది. ఆ బిడ్డ ఒక రైతు యింట పెరిగి పెద్దదవుతుంది. ప్రభావతి అనే ఆ బాలికను వివాహం చేసుకొన డానికి శ్రీహరిరావు నిశ్చయం చేసుకుంటాడు. చివరకు ఆమె బిడ్డయని తెలియగా సిగ్గుపడి ఆమెను తనయింటనే పెరిగి పెద్దవాడయిన మేనల్లున కిచ్చి వివాహం చేస్తాడు.

సంభాషణలు మధ్యమధ్య పద్యాలు ప్రేక్షకులకు కథ సులభంగా బోధపడే తీరులో జాతీయాలతో, సామెతలతో సరళంగా, చురుకుగా నడుస్తున్నాయి.

రచయిత దేశభక్తి గాంధీజీ సిద్ధాంతాలపట్ల ఆయన ఆసక్తి, సంఘ సంస్కరణానురక్తి నాటకం అంతట కనుపిస్తున్నాయి.

"1950 జనవరి 26 న తేదీనుంచి సంపూర్ణ స్వపరిపాలనాధికారం యేర్పడింది. కాని.... "నోరున్నవారిదే రాజ్యం నొల్లుకున్న వారిదే భోజ్యం" అయిపోయి ప్రజాసామ్యఫలితం ప్రజానీకానికంతకు సమానంగా

సమకూరక పాలకశకటం వక్రగమనాని కుపక్రమించింది." అంటూ వివేకవంతులయిన రైతుబిడ్డలచేత విమర్శింపజేయటం రచయిత లోక వ్యవహార వివేకతకు నిదర్శనం.

ఆంధ్ర దైనిక పత్రిక.
8—12—57
మద్రాసు

కన్నకూతురు — ఇదియొక సాంఘిక నాటకం. ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి, కవిసార్వభౌమ, శ్రీ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారిచే 'ఆశీస్సు' వ్రాయబడినది. శ్రీ శాస్త్రిగారి అధ్యక్షతను ప్రదర్శనబడసి, పలువుల పెద్దల మెప్పువడసిన సాంఘిక నాటకం.

ముఖ్యంగా యిందులో కవిగారి ప్రత్యేకత; కవిత; భావప్రస్ఫుటన; వ్యంగ్య, విమర్శ; నిపుణత ప్రతి దృశ్యంలోనూ దృగ్గోచరమవుతూ వుంది. సంభాషణలలో రసజ్ఞత, ఒద్దిక, గంభీరత, మృదుత ఈనాటకానికే ప్రాణం పోసినవి.

కవిగారుకథను కల్పించడంలో ఇతిహాసాన్ని గుంభనపరచి నడించడంలో శిల్ప సంపత్తికి జీవం చేకూర్చడంలో, నాటకరంగ విభజనా సామగ్రిని సాధించడంలో కథానంతరం కలియకలు ముగింపులు ఒక్కుమ్మడిగా కలుపుటలో సిద్ధహస్తులైన అనుభవజ్ఞులని నిరూపించుకున్నారు.

భాష — భాషకు మించిన భావన, భావనకందిన పదలాలిత్యం, లాలిత్యానికి తగిన రసపోషణ, రసపోషణకు వన్నెకూర్చిన పేరాశలేని సున్నితత్త్వం, ఆ సున్నితపు నడకల్లో శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, భీభత్సాద్భుత శాంతరసాల్ని చక్కగాపంచి ఈ నాటకాన్ని రూపొంచి రచించారు.

ఈ నాటకం ప్రదర్శనార్హత కలిగి పండిత, పామరలోకాన్ని హర్షింప జేయగలదు.

దేశబంధు పత్రిక.
14—1—59
నరసాపురం : ప॥ గో॥ జిల్లా.

# "సినిమా"

సంపాదకులు

## పూజ్యశ్రీ ఇంటూరి వెంకటేశ్వరరావుగారు

మద్రాసు — 24.

సనాతన ఫక్కీలో పద్యాలు అధునాతన పంథాలో మాటలు నడిచిన సాంఘిక నాటకం యిది.

కథావస్తువులో వాస్తవికత మరుగుపడ్డా రసానుభూతిని చేకూర్చే "డ్రమెటిక్ ఎలిమెంట్" మనకు టన్నులకొద్దీ దొరుకుతుంది.

రచయిత జాతీయోపాసకుడని, అభ్యుదయవాదని, సంఘసంస్కర్తని మనకు యీనాటకంలోని ప్రతి సన్నివేశంలోనూ బోధపడుతుంది.

ఈ నాటకంలో ప్రవేశ పెట్టబడ్డ పాత్రలు రచయితయొక్క భావ పరాకాష్ఠతకు సాక్ష్యమిస్తున్నాయి.

పుస్తకం ఒక్కసారి చేతిలోకి తీసుకున్నాక ఆఖరివరకు యెవ్వరూ చదవకుండా వదలి పెట్టడానికి వీలుండదు.

"కట్టేవి ఖద్దరుబట్టలు కొట్టేవి బీదలపొట్టలు" "వేసిన బెడ్డకళ్లా ఊరుకుంటే వెట్టోడే గెలుస్తాడు" కళ్లకు గుచ్చుకుంటుందన్న పుల్లను కని పెట్టి తప్పించుకోవాలి" "పదవీ వ్యామోహపరులు పదవుల్లో వున్నంత కాలం ప్రజలపాట్లు భగవంతుడుకూడా తీర్చలేడు" "పెంచినకుక్కే కాలు కరిచింది" "చేత రేణువంత మాట మేరువంత" మొదలగు సూక్తులు నాటకంయొక్క పరిపుష్టికి మరింత దోహదం చేస్తున్నాయి.

రచయిత శ్రీ ఆముజాల నరసింహమూర్తి యొక్క కలం నుంచి బలంతో కూడిన యీలాంటి నాటకాలు మరెన్నోవచ్చి కళాభిజ్ఞుల పుష్పాక్షతల నందుకోవాలని ఆశిస్తున్నా.

ఆంధ్రదేశపు సాహిత్యరంగానికి చెందిన ఆధునిక వైతాళికుల్లో శ్రీ ఆముజాలనుకూడా తప్పకుండా చేర్చవలసింటుందని నా కోరిక.

ఇట్లు

ఇంటూరి వెంకటేశ్వరరావు

“కవిసార్వభౌమ” బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రుల వారి పర్యవేక్షణమున వీరవాసరం హనుమాన్ టాకీస్‌లో ప్రథమ ప్రదర్శనమున బాల్గొని శ్రీ కవిసార్వభౌములవారి యాశీస్సుల నందుకొనిన శ్రీ మురళీ కృష్ణ నాట్యకళాసమితి వారి నటీనటవర్గం.

1. శ్రీహరిరావు – మద్దాల బాలాజీరావు
2. అమర్‌నాథ్ { 1. నూకల రంగా / 2. కంచి శ్రీనివాస్ (భాషాప్రవీణ)
3. గణపతి – మద్దాల ప్రకాశరావు
4. ధర్మయ్య – నూకల వెంకటరావు
5. భాస్కరరావు - నాని కృష్ణా
6. దయానందస్వామి - నిమ్మల అప్పారావు
7. డాక్టర్ – మద్దాల వామనమూర్తి
8. సత్యవతి - శ్రీమతి ముత్యవేణి
9. ప్రభావతి - శ్రీమతి రాజేశ్వరి

డైరెక్షన్ : బాలాజీ.

మ్యూజిక్ : గుండా కృష్ణమూర్తి & పార్టీ.

ఆర్గనైజర్సు :

మద్దాల రాజారావునాయుడు & మద్దాల సింహాద్రిరావు.

---

హెచ్చరిక !

నా లిఖితపూర్వకమైన అనుమతి లేనిదే నాయీ నాటకాన్ని యే నాటక నిర్వాహకులు, యే నటీనటులు ప్రదర్శింపరాదు. ఎవరు స్క్రీన్ చేయరాదు. రేడియో బ్రాడ్ కాస్టింగు, రికార్డింగు చేయరాదు. భాషాంతరీకరణం చేయరాదు. ముద్రింపరాదు. పైవానికి వ్యతిరేకంగా ప్రవర్తించిన వారు నేజరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

ఇట్లు
ఆముజాల నరసింహమూర్తి.

---

# పాత్రపరిచయం

1. శ్రీహరిరావు...వయస్సు 50 సం॥ కథానాయకుని మేనమామ దేవాలయధర్మకర్త. విషయసుఖాభిలాషి. గణపతిచేతికీలుబొమ్మ.
2. అమర్‌నాథ్...వయస్సు 8 సం॥ల నుండి 22 లోపు. కథానాయకుడు. "పదవీ వ్యామోహపరులు పదవుల్లో వున్నంతకాలం ప్రజల పాట్లు భగవంతుడుకూడా తీర్చలేడ"ను భావంగల పరోపకార పారీణుడు.
3. గణపతి...వయస్సు 40 సం॥ దేవాలయపు గుమాస్తా. పాపభీతిలేని భౌతికవాది. ఎక్కువగా మాట్లాడువాడు.
4. ధర్మయ్య...వయస్సు 60 సం॥ల లోపు. కథానాయిక పెంపుడు తండ్రి. బ్రతికి చెడిన రైతురాజు.
5. భాస్కరరావు...వయస్సు 22 సం॥ల లోపు. ధర్మయ్య కొడుకు. యువజన సంఘ కార్యదర్శి. నిర్మొగమాటంగా మాట్లాడు నిస్స్వార్థపరుడు. అమర్‌నాథ్ మిత్రుడు.
6. దయానందస్వామి...వయస్సు 50 సం॥ సర్వోదయ సమాట్లాశ్రమాధిపతి. బూజుపట్టిన పూర్వాచారాల్ని తోసిరాజని ముందడుగు వేసిన సంఘసంస్కర్త.
7. డాక్టర్...వయస్సు 35 సం॥ ఇంగిత జ్ఞానంగల విశాలహృదయుడు ఆశ్రమ వైద్యుడు, నిరాడంబరజీవి.
8. సత్యవతి . వయస్సు 15 సం॥ కథానాయిక కన్నతల్లి. ఆదర్శ సాధనానికయి ఆత్మార్పణం చేసుకొన్న అఖండ ప్రజ్ఞావతి.
9. ప్రభావతి...వయస్సు 15 సం॥లు శ్రీహరిరావు కన్నకూతురు. కథానాయిక. సంఘనిర్ణయాన్ని ఆత్మత్యాగంద్వారా సంస్కరింపదలచిన సాధ్వీమణి.



## నటరాజస్తవం

శ్లో॥ శ్రీసత్కళావిలసన ప్రభవాయలోకే।
సృష్టిస్థితి ప్రళయనిర్వహణాధిపాయ
శ్రుత్యాప్యబోధ్యమహిమాన్విత రూపభాజే।
తస్మైనమోఽస్తు నటరాజవరాయనిత్యమ్.

## భారతమాతృ వందనం



భారత జననీం పాపహారిణీం
కారుణ్యాలయాం కమనీయాం భజే ॥భార॥

1. నదీనద కానన, నగగణలసితాం
సదమల హృగాయాం, శాంతాభరణాం ॥భార॥

2. సకలసస్యఫల, సంపదు పేతాం
సకలదేశసం, స్తవనీయాం మే ॥భార॥

శ్రీః

# కన్యాశుల్కం

## (ప్రథమదృశ్యం)

(శ్రీహరిరావుగారిమేడ-సత్యవతి గది. రాట్నం వడకుతూవున్న గాంధీగారిచిత్రపటం దాని కిరువైపుల పూజాపరికరాలు. డ్రాయరు దాని మీద చిన్నగడియారం, వెలిగించినలైటు, కొంచెం దూరంగా రెండు కుర్చీలు, గోడకు చాల రకాల ఫోటోలు వుండును.)

సత్య : (ఫలాహారపు పళ్లెంతో ప్రవేశించి) అమర్ ! ఓ అమర్ ! (బిగ్గరగా) ఓ చినబాబు ! నీముస్తాబు ఇంకా పూర్తికాలేదా ? (పళ్లెం క్రింద పెట్టును)

అమర్ : (లోపల తనగదిలోనుంచి) వస్తున్నా అత్తాయి!

సత్య : నువ్వు వచ్చేసరికి పుణ్యకాలంకాస్తాగడచిపోయేటట్టుంది.

అమర్ : (ప్రవేశించి) వచ్చేసేగా? (గాంధీగారి ఫోటోచూచి ఆనందంతో) ఈవేళ గాంధీతాతను పెండ్లికొడుకులా అలంకరించావెందుకత్తాయి !

సత్య : ఎందుకా ? యీవేళ గాంధీజయంతి కదూ మరి ?

అమర్ : అంటే ?

సత్య : అంటే ! యీ రోజు మన గాంధీతాత పుట్టిననాటి పండుగ అన్నమాట.

అమర్ : అందుకు మనం ఈవేళ యేంచేయాలి అత్తాయి.

సత్య : ఏంచేయాలా ? మనంకూడా ప్రపంచ ప్రజలతో బాటు సూత్రయజ్ఞంచేసి గాంధీమహాత్ముణ్ణి పూజించి, ప్రార్థించాలి.

అమర్ : గాంధీతాత మనకుచేసిన మహోపకారం యేఁవిటి.

సత్య : ఏఁవిటో చెబుతా విను.

సీ॥ అస్పృశ్యతా వారణాయత్త చిత్తత
సర్వసమత్వంబుఁ జాటెనెవఁడు ?
పరవస్తుదుర్మోహ పరతావిముక్తికై
పాయని హితబోధఁ బలికెనెవఁడు ?
పరదేశ శృంఖలా బద్ధస్వదేశీయ
దాస్యముక్తినొనర్చి తనరెనెవఁడు ?
దుర్వ్యసనాసక్తిఁ దొలఁగించి దేశ దా
రిద్ర్యబాధల నివారించె నెవఁడు ?
తే॥ అట్టి శమదమనయయుతు నమలచరితు
సర్వదేవాంశ సంభూతు సకల దేశ
పూజ్యు గాంధీ మహాత్మునిఁ బూటపూట
పూజగావించి ధన్యతఁ బొందవలయు.

అమర్ : ఓహో ! అందుకా నాకు యీవేళ క్రొత్తబట్టలు కుట్టించి కట్టుకోమని యిచ్చావ్ !

సత్య : అవును చినబాబు ! పిండివంటకూడా పండుగ అనేగా యీవేళ వండుకున్నాం.

అమర్ : (ఆనందంతో) ఎంతమంచిదానవత్తాయి.

సత్య : నామంచికేంగాని ! మొన్న చెప్పిన దండకం, వచ్చేసిందా ? నీకు ?

అమర్ : నిన్నే వచ్చేసిందత్తాయి!

సత్య : అయితే నాతో కలిసి పాడాలిమరి. (అగరువత్తులు వెలిగించి గాంధీఫోటో యెదుట అర్ధనిమీలిత నేత్రయై నిలబడి చేతులు జోడించును.)

అమర్ : (సత్యవతి ప్రక్కన నిలబడి ఆమె ననుకరించును.)

## దండకం

శ్రీమత్కరమ్‌చందు గాంధీ! స్వకీయాద్భుతోద్యన్మహాశక్తి సంతోషితాత్మీయ సంబంధీ! హిందూ ముసల్మానమృతాంభోధి సంధానకార్యైక పానీయసంధీ! జగత్‌స్తుత్యగాంభీర్యకంఠీ! సమస్తప్రపంచైకబంధూ! సుధీలోక పూర్ణేందు! సర్వప్రజాదాస్య విచ్ఛేదకృద్రాజకీయోత్తమ జ్ఞాన సింధూ! భవత్తుల్యుఁడౌ సత్యవాక్పాలనామోఘ సచ్ఛాంత్యహింసాదయాస్పృశ్యతావారణత్యాగ శౌచామల స్వాంతుఁడీ యైదుఖండంబులన్ మున్ను జన్మింపలేదంచు ముందైన జన్మింపఁబోడంచుఁ జేయెత్తి వాక్రుచ్చెదన్ ధర్మసంస్థాపనార్థంబు నారాయణాంశంబునన్ భారతాంబామణీపుత్రరత్నంబవై పుట్టి యన్యాధిపక్రాంతి సంబాధితస్వీయ దేశీయదారిద్ర్యగాఢాంధకారంబు నిర్మూలనంబుం బొనర్పంగ సత్యాగ్రహా పూర్వ దివ్యాస్త్రసంధానమున్ జేసి చేయించి యెవ్వారికిన్ లేశమాత్రంబుఁగష్టంబు నష్టంబు లేకుండ ప్రత్యర్థులన్ నాకలెక్కించి సంద్రంబుదాటించి దేశైక సౌభాగ్య సంధాన ధౌరేయులౌ భవ్యరాజేంద్ర పట్టాభి నెహ్రూ పటేల్ టంగుటూరి ప్రకాశాది విద్వజ్జన స్కంధపీఠంబులన్ శాసనోద్భారమున్ మోపి శాంత్యోపదేశంబులన్ జేయుచున్ సర్వదేశాల కాదర్శనీయుండవై యుండి దిగ్నాగవేదాత్మ భూచంద్రవర్షంబునన్ (1948) దేహలీపత్తనంబందు సభ్యాళితోఁగూడి శ్రీరామనామస్మృతిన్ జేయుచున్ దుష్ట గోడ్సే మతోన్మాది దుర్మారణాస్త్ర ప్రహారంబునన్ నేలపై వ్రాలి ప్రాణంబులన్ బాసి సత్కీర్తికాయుండవైనావు కాలత్రయాదర్శమూర్తి! సుధీచక్రవర్తీ! జగత్పూర్ణకీర్తీ! నమస్తే నమస్తే నమస్తే నమః.

సత్య : (గాంధీగారికి సాష్టాంగ నమస్కారంచేసి లేచి ఫలాహారం కళ్లనద్దుకుని అమర్‌నాథునికిపెట్టి, తాను కొంచెంతిని) చినబాబు! యీ వేళ మొదలుకుని నువ్వు ప్రతి రోజు యిలా గాంధీతాతకు నమస్కరించి ప్రార్థించాలి.

అమర్ : ఇలా ప్రార్థించడం ? ప్రతీరోజూ యెందు కత్తాయి !

సత్య : ఎందు కేవిటి ? మహాత్ముల్ని పూజించి, ప్రార్థించడం మన కర్తవ్యం.

అమర్ : మహాత్ముడంటే దేవుళుతో సమానుడా! అత్తాయి!

సత్య : సమానుడేవిటి ? సాక్షాత్తు సర్వేశ్వరుడే.

అమర్ : సర్వేశ్వరుడయితే మనంకోరుకున్న వరాలుయిస్తాడా?

సత్య : ఎందుకివ్వడు ? ప్రతిరోజు నువ్వు చేతులు జోడించి భక్తిశ్రద్ధల్తో "మహాత్మా! నీశారీరిక మానసికశక్తుల్ని నాకిచ్చి మనోవాక్కాయ కర్మలతో దేశసేవ చేసే వాణ్ణిగాచేస్తూ ఆయురారోగ్యభాగ్యాలిస్తూ కాపాడు" అని ప్రార్థించాలి.

అమర్ : (అమాయకంగా) ప్రార్థిస్తే ?

సత్య : ప్రార్థిస్తే! నువ్వు మనస్సులో కావాలనుకున్న కోరికల్ని నిరాటంకంగా నెరవేరుస్తాడు.

అమర్ : (ఆనందంతో) నిజమా ? అత్తాయి !

సత్య : నిజంకాకపోతే ! ఎప్పుడయినా అబద్ధం చెప్పేనా ?

అమర్ : (ఉత్సాహంతో) అలా అయితే మన గాంధీ తాత కూడ రాముడు, కృష్ణుడు, బుద్ధుడులాంటి దేవుడే అన్నమాట. కదూ ?

సత్య : కాదుమరి ! వారిలా మన గాంధీతాతకూడ అసమాన శక్తిశాలి కాకపోతే హైడ్రోజన్ శక్తిని అధిగమించిన అహింసాయుధబలంతో అనాయాసంగా ఆంగ్లేయుల్ని అగ్గిబోటులు యెక్కించి ఆవలకుపంపి మనకు స్వపరిపాలనాధికారాన్ని సంపాదించి యివ్వగలడా ?

అమర్ : (సాలోచనగా) అయితే ! అంతగొప్పవాడు బీదవాడులా కొల్లాయికట్టుకొని రాట్నం యెందుకు వడికేడు మరి చెప్పు అత్తాయి ?

సత్య : ఎందుకు వడికేడో ! చెబుతా విను. చినబాబు !

సీ॥ దారిద్ర్య గాఢాంధకారంబుఁబాపంగ
రాజీవమిత్రమీ రాట్నమె కద !
తంతు నిర్మాణయంత్రాలయోద్ధతి మాన్ప
బ్రహ్మాస్త్రరాజమీ రాట్నమె కద !
స్వజనవియోగాగ్నిఁ జల్లార్పఁగా మనో
రంజకబంధువీ రాట్నమె కద !
దుర్బలత్వంబును దొలఁగింప నౌషధ
రాజంబవశ్యమీ రాట్నమె కద !
తే॥ "కదురు తిరగినఁ గవ్వంబు కదలుచున్న
లేమియనుమాట లేశంబు లేకయుండు"

నసెడు సూక్తిని సర్వంబు నాదలఁగొని
నిత్యమున్ దత్పరిశ్రమ నెరపవలయు.

అని వడికేడు తెలిసిందా ?

అమర్ : (హుషారుగా) తెలిసింది అత్తాయి ! రాట్నంవడికే వాళ్లకి యెన్నిలాభాలు వున్నాయి ! నేనుకూడా రేపట్నుంచి గాంధీతాతలా రాట్నం తప్పక వడుకుతా.

సత్య : మంచిది చినబాబు ! గాంధీతాతలా నువ్వుకూడా రాట్నం వడకుతూ శాంతి సమత్వాల్ని అలవర్చుకొని శాంతిదూతవు కావాలి. ప్రపంచానికి వుపకరించే పన్లు చేస్తూ ప్రఖ్యాతి గడించాలి. తెలిసిందా ?

అమర్ : (సంతోషంతో) ఓ తెలిసిందత్తాయ్ ?

సత్య : ( గాంధీగారికి నమస్కరించి ) మహాత్మా ! మా అమర్‌నాథ్‌ని ఆశీర్వదించి నీలోని శమదమాది సద్గుణాల్ని ప్రసాదిస్తూ, నీలా ప్రపంచ ప్రఖ్యాత పురుషుణ్ణిగా తయారుచేయితండ్రీ ! (అమర్‌నాథు నుద్దేశించి) ఏది ? చినబాబు ! నిన్న చెప్పిన పద్యం అప్పజెప్పు ?

అమర్ : (అప్ప జెప్పును)

ఆ॥ తెలియనట్టివానిఁ దెలియఁజేయఁగవచ్చుఁ
దెలిసినట్టివానిఁ దెలుపవచ్చు
తెలిసి తెలియనట్టిధీదుర్విదగ్ధునిఁ
తెలియఁజేయ వశమె ? నలువకైన

సత్య : (సంతోషంతో) శెభాష్ ! చక్కగా అప్పజెప్పావ్ చినబాబు ! (బుజ్జగించును)

అమర్ : క్రొత్త పద్యం మరొకటి యిపుడు చెబుతావా ? అత్తాయి !

సత్య : ఇపుడు కాదు. రేపు చెబుతాలే నాయనా !

అమర్ : (గోడకు తగిలించివున్న ఫోటోలుచూచి సంతోషముతో) ఈ ఫోటోలు యెప్పుడు తెప్పించావత్తాయి!

సత్య : ఈపూటే వచ్చాయి నీకు నచ్చాయియా ?

అమర్ : ఓ నచ్చాయి. (సమీపించి) ఈ ఫోటోలోవున్న వాళ్లు యెవరెవరు అత్తాయి ! అలావున్నారు ?

సత్య : (వ్రేలితో కనపరచి) పాపం వారేనా ?

సీ॥ ఆదిప్రేతభూతాల కాకరమైయున్న
శాశ్వత సుఖదశ్మశానభూమి
ఆత్యాగజీవి సత్యవ్రత దీక్షితుఁ
డిందోప్రపముఁడు హరిశ్చంద్రనృపతి
ఆ సాధ్వి సర్వంసహా చక్రవర్తికి
దేవేరి చంద్రమతీ శుభాఖ్య !
ఆ బాలకుండు ధైర్యస్థైర్య గాంభీర్య
జలరాశి లోహితాస్యాభిధుండు

తే॥ కాశికాగ్రహవశమున, ఘనుఁడురాజు
కాటి కాపరియై, రాణి కాలకౌశి
కగృహదాసియై, బాలుఁడు గహనసీమ
మృతుఁడునై, పడరానట్టి వెతలఁబడిరి.

అమ : పాపం! విశ్వామిత్రుడు వీరి కుటుంబాన్ని యెన్ని బాధలు పెట్టేడు? అత్తాయి!

సత్య : ఎన్ని బాధలు పెట్టినా హరిశ్చంద్రుడుమాత్రం వెనుకంజ వేయక, తన సత్యవ్రతాన్ని సార్థకంచేసుకుని, "సత్య హరిశ్చంద్రుడు" అని అనిపించుకున్నాడు.

అమర్ : లేక మాటమాటఆడి మహనీయు లెలా అవుతారు? (మరొక ఫోటో చూపించి) వీరెవరత్తాయి.

సత్యం : (వ్రేలితో కనపరచి) వీరేనా ?

సీ॥ రఘుకులవారాశిరాకాసుధాకరుం
డై జనియించిన యాదిమూర్తి
శివధనుర్భంగంబుఁజేసి సీతాపతిఁ
బెండిలియాడిన విశ్వమయుఁడు
పితృవాక్యపాలనాభీష్ట మనస్కుఁడై
వనవాసియైనట్టి ఘనయశస్వి
రావణముఖదుష్ట రాక్షసావళిఁదుంచి
జగములఁబ్రోచిన శాంతిదూత

తే॥ అజమహేశ్వర జిష్ణుసమార్చితుండు
దీనమానవరక్షణ దీక్షితుండు
పద్మపత్రాయతాక్షుండు భాసురుండు
సాలవృక్షోన్నతుఁడు రామచంద్రుడితఁడు.

అమర్ : అలాంటి అద్భుతకార్యాలుచేసిన అవతారమూర్తి గనుకనే శ్రీరామచంద్రుణ్ణి అందరు ఆరాధిస్తారు.

సత్య : నిజం గ్రహించావ్ చినబాబు !

అమర్ : (వ్రేలితో కనపరచి) ఈ మహారాజు యెవరత్తాయి!

సత్య : (వ్రేలితో కనపరచి) ఇతడేనా?

సీ॥ కుంతికి ముద్దులకొమరుఁడై సూర్యుని
　　మహిమచేఁబుట్టిన మాన్యుఁడెవఁడు?
ఆ బాల్యమిత్రుఁడై యా సుయోధనునకుఁ
　　గుడిభుజంబనఁగఁదోడ్పడెనెవండు?
తమ్ములంచుఁదెలిసి తాఁబాండవేయుల
　　పక్షంబుఁజేరని భవ్యుఁడెవఁడు?
తనుమనఃప్రాణముల్ దానంబుఁగావింప
　　వెనుకంజవేయని వీరుఁడెవఁడు?
తే॥ కవచ కుండలమండిత కాయుఁడెవఁడు?
స్వామివిద్రోహికాని, నిస్స్వార్థియెవఁడు,
అట్టి యాసూతపోషితుఁడమలచరితుఁ
డితఁడె, కర్ణాభిధేయుండు, శ్రితహితార్థి.

అమర్ : (ఆనందముతో) ఆహా! అలాంటివాడు కాకపోతే వీనికి వీరకర్ణుడను బిరుదు యెలావచ్చింది? (వ్రేలితో చూపించి) ఈగడ్డంసాయీబు యెవరేఁవిటత్తాయి!

సత్య : (నవ్వి) సాయీబుకాడు చినబాబు!

చ॥ ఇతఁడెశివాజి, వీరవరుఁడిద్ధ పరాక్రమశాలి, మాతృదే
వతిఘనబోధనంబునను, భారతదాస్యవిముక్తిఁజేయఁగా,
మతిఁదలపోసి; ముస్లిముల మారణహోమముఁజేసి; విశ్వవి
శ్రుతయశమంది; హిందుమతసుస్థిరశాంతిదుఁడయ్యెనుర్విపై.

అమర్ : (ఉత్సాహంతో) అందుకే మంచిపన్లుచేసినవారి పేరు ప్రఖ్యాతులు మరుగుపడవన్నారు లోకంలో.

సత్య : ఎలా మరుగుపడతాయి శరీరాలుపోయినా మహనీయుల కీర్తికిమాత్రం మాలిన్యంపట్టదు. (శ్రీహరిరావు వచ్చు

చున్న అలికిడివిని భయంతో) తక్కినవారినిగురించి తరువాత చెప్పుకుందాం మీామామయ్యగారు వస్తున్న ట్టున్నారు నీగదిలోకి వెళ్ళిపో, చినబాబు !

అమర్ : (నిర్లక్ష్యంగా) రానియ్! మా మామయ్య దయ్యమా? భూతమా ? ఎందుకు నువ్వలా భయపతావ్ !

సత్య : (ఆదుర్దాగా) భయపడక అనవసరంగా మీా మామయ్యగారితో కయ్యం పెట్టుకోమంటావా !

అమర్ : (నిర్భయంగా) కయ్యానికి మనం యేంకానిపని చేస్తున్నామని నీ భయం ?

సత్య : భయంకాక యేంచేయమంటావ్ ! ఇష్టంలేనివారి యెదుట మనంయేంచేసినా కష్టంగా వుంటుంది.

అమర్ : (ఆవేశంగా) కష్టంగా వుంటుందని మనకిష్టమైనపని చేయడం మానివేస్తామా ?

సత్య : మానకపోతే మనమర్యాద దక్కదు. బాబ్బాయి ! నీకు పుణ్యం వుంటుంది. నామాట విని, వెళ్ళుబాబు !

శ్రీహ : (ప్రవేశిస్తూ వెటకారంగా) మీా చినబాబు నీమాట వినక, నామాట వింటున్నాడా ?

సత్య : (ఉలిక్కిపడి తెప్పరిల్లి నవ్వు తెచ్చుకొని) వినక మీారు కాదన్నపని చినబాబు చేసిందేముందండి ?

శ్రీహ : (ఈసడింపుతో) చేసిందిలేదేం ? నువ్వు చెప్పిపెట్టే చరిత్రల్ని, చెవిని పట్టించుకుని, యిప్పట్నుంచి నాకు యెదురుచెప్పడం మరి యేంవిటంటావ్ !

అమర్ : (నిర్భయంగా) అడిగినమాటకు సమాధానంచెప్పడం అపరాధం అంటారా ? మామయ్యా !

శ్రీహ : (తృణీకారభావంతో) అపరాధంకాదు. విపరీతం.

సత్య : (శాంతంగా) "పిచ్చుకమీదా బ్రహ్మాస్త్రం ? ఎందు కండి అలా మండిపడతారు ?"

శ్రీహ : (తిరస్కారంగా) ఎందుకా ? పట్టుమని పదేళ్ళులేని వానికి బయట దేశభక్తిప్రబోధాల్తో భాస్కరావు, యింట చరిత్ర ప్రబోధాల్తో నువ్వు చివరకు వీని కొండ నాలుక్కి మందువేసి, వున్ననాలుక కాస్తా వూడబెరికే లాగున్నారుగనుక.

సత్య : ఓహో ! అదా? మీ అనుమానం. కాని పూర్వజన్మ సంస్కారికి వయస్సుతో పనేముందండి ?

శ్రీహ : వయస్సుతో పనిలేదని పనికిమాలిన ప్రబోధాలుచేస్తూ మొండిచేతుల వానికి శెనగలు తినడం నేర్పుతావా !

అమర్ : (సందేహంతో) అంటే !

శ్రీహ : (వెటకారంగా) అంటే ! ఎద్దుముడ్డి పొడుచుకునే రైతుబిడ్డకి విద్యావిషయాలు యెందుకూ అని.

సత్య : (ఆశ్చర్యంగా)ఎందుకేం విటండి! విద్యావివేక సంపన్ను డయి రైతుబిడ్డమాత్రం రాజ్యాన్ని యేలగల రాజు కాకూడదంటూరా ?

శ్రీహ : (తిరస్కారభావంతో) కాకేం ! రయితే రాజ్యాన్ని యేలే రాజయితే ..... ...

సత్య : (అందుకుని) రాళ్ళసీమలుకూడ రత్నాలసీమలవు తాయి......

అమర్ : (చమత్కారంగా) పంటచేలు బంగారమవుతాయి.

శ్రీహ : (ధిక్కారంగా) హుం! యింకేం? ఇద్దఱు యేకమయి నన్ను హేళనకూడాచేస్తున్నారన్నమాట!

సత్య : (చిన్నబుచ్చుకుని) అదేవిటండీ! అయిందానికి కాన్దానికి అలా అపార్థం చేసుకుంటారు?

శ్రీహ : (కోపంతో) ముడ్డిగిల్లి జోలపాట పాడడం మోసం కాదంటావా!

సత్య : మోసానికి యెవరేం దోషం చేసేరంటారు?

అమర్ : (నిద్రవచ్చినట్టు అభినయించి ఆవలించును)

సత్య : (చూచి, చినబాబు! నిద్ర వస్తూవుంటే యింక నీవు వెళ్ళి పడుకో!

అమర్ : (వెళ్ళును)

సత్య : (కొంచెందూరం సాగనంపి తిరిగివచ్చి) ఇంతకూ మీరు గణపతిగారియింటికి ముహూర్తం పెట్టించుకుని వస్తానని చెప్పి వెళ్ళి, వెంటనే తిరిగివచ్చారేమండి?

శ్రీహ : (నిస్పృహతో) "వినాయకుని వివాహాలకి వేయి విఘ్నాలు" అన్నట్టు యీనా మూఢవమనువుకియిన్ని విఘాతాలు యేర్పడుతూవుంటే! తిరిగి రాక యేం చేయమంటావ్!

సత్య : (దిగాలుపడి) మూఢంఅని, ముహూర్తాలు లేవని, మూణ్ణాళ్ళు గడిపివేశారు......

శ్రీహ : కాలం కలిసిరానప్పుడు యెన్నినెలలయినా గడు స్తాయి — యేంచేయమంటావ్ !

సత్య : ఈ పర్యాయం యేం అభ్యంతరాలు యేర్పడ్డా యంటారు ?

శ్రీహ : (తటపటాయిస్తూ) యేంఅభ్యంతరాలంటావా ? యే డేళ్ళు దాటేవరకు నేను వివాహం చేసుకోవడానికి వీల్లేదట........

సత్య : (నిర్ఘాంతపోయి) ఏడేళ్ళా ? యెవరండీ చెప్పిందీ ?

శ్రీహ : ఎవరో వెట్టిబుట్టి వెంగళప్ప కాదు, జ్యోతిశ్శాస్త్రాల్ని తలక్రిందులుగా చదివిన సిద్ధాంతిగారే చెప్పేరు.

సత్య : శాస్త్రాల్ని తలక్రిందులుగా చదివిన సిద్ధాంతిగారు తారుమారుగా చెప్పక తిన్నగా యెలా చెప్పగలరు ?

శ్రీహ : తిన్నగా చెప్పలేనివారయితే ! నా భూతభవిష్య ద్వర్తమానాల్ని బృహస్పతిలా పూసగ్రుచ్చినట్టు ఎలా చెప్పగగిగేరు ?

సత్య : మీ జాతకపత్రికలో లేని విషయాన్ని ఆ సిద్ధాంతిగారు మీ ముఖంచూచి చెప్పేరుగాబోల్నేమండి ?

శ్రీహ : ముఖంచూచికాదు చెప్పింది. నా చేయిచూచి.

సత్య : జాతకపత్రికలో వ్రాయంది చేతిలో వ్రాసివుందని చేప్పేరంటారు ?

శ్రీహ : అవును. చేతి రేఖల్లోగాని ఘడియ ఘడియకి మార్పు జెందే గ్రహాగమనం జాతకపత్రికలో కనిపించదని ఖచ్చితంగా చెప్పేరు.

సత్య : ఎవరేం చెప్పినా "విస్సన్న చెప్పిందే వేదం" అని విశ్వ
శిస్తారా ! మీారు.

శ్రీహ : విశ్వసించక కళ్లుమూసుకుని గరళం త్రాగమంటావా?

సత్య : గరళం త్రాగమని కాదండి నే చెప్పేమాట.

శ్రీహ : మరి యింకేమని ?

సత్య : వెనుక ముందులు విచారించి శ్రేయోదాయకమయిన
కార్యం చేయమని.

శ్రీహ : అందుకనేగా! గణపతి నేను కలిసి, గంటసేపు దీన్ని
గురించి తర్జన భర్జన్లు చేసేం !

సత్య : (అసూయగా) చేసి... చివరకు నాకు అన్యాయం
చేయడానికి నిర్ణయించుకున్నారన్నమాట.

శ్రీహ : అన్యాయం చేయాలనేవాణ్ణయితే అనునయవాక్యా
ల్లో సిన్ను అవునని పించవలసిన తాపత్రయం నాకేం
పట్టింది.

సత్య : (అసూయగా) అయితే! పరబుద్ధిప్రకారం ప్రవర్తించ
వలసిన ప్రమాదం యేర్పడిందంటారు ?

శ్రీహ : ప్రమాదానికి రాకపోతే ! యీా యేల్నాటిశని ప్ర
మాదానికి వచ్చిందా ? యింతకు నాకు సంసారినయి
సౌఖ్యం అనుభవించే సౌభాగ్యంవుంటే! యీా మనువుకే
యిన్ని యిక్కట్లు యెందుకు యేర్పడతాయి ?

సత్య : సంశయించేవారికి శతకోటి సందేహాలు.

శ్రీహ : సంశయించక సాహసించి చావమంటావా ?

సత్యా : ఇంతకు మీరనేదేఁవిటండీ ?

శ్రీహ : నేననేది ప్రాణాల్ని పణంగాబడ్డి పరిణయంఆడి పల మెత్తు ప్రయోజమైనా లేదంటాను.

సత్య : (తెగింపుతో) మీ మాటప్రకారం మీ మనువుని నమ్ముకుని మీ యింటపడి వున్నందుకు, నన్నిప్పుడు యేగంగలో దిగమంటారు ?

శ్రీహ : గంగలో దిగవలసి గ్రహచారంయేం కాలింది నీకు?

సత్యా : (దీనంగా) గ్రహచారం కాకపోతే ! కల్లబొల్లి గాలి కబుర్లతో ఆనాడు నాకళ్ళు కప్పి యీనాడు మీరు హృదయంలేకుండా మాట్లాడతారా ?

శ్రీహ : హృదయంవుందిగనుకే వుపేక్ష చేయకుండా వున్న మాట చెప్పేశాను.

సత్యా : ఏమని చెప్పేరు ?

శ్రీహ : పెళ్లిచేసుకుంటే నా ప్రాణానికి ప్రమాదం అని.

సత్యా : (ఆవేశంగా) అంత ఆత్మదౌర్బల్యంగలవారు ఆదిలో కాసులపేరు నామెడలోవేసి "యిదే మనకుగాంధర్వ వివాహం" అనిచెప్పి ఆనాటినుంచి కాపురంకూడా చేయించుకుంటూ......

శ్రీహ : కాదని యెవరన్నారు ?

సత్యా : కాదనకపోతే! యీనాడు యీ కుంభకోణంయేఁవిటి?

శ్రీహ : (మొండిగా) కుంభకోణానికి నేనే నీకుభర్తనని, నీవే నాకు భార్యవని పత్రాలు వ్రాసుకోలేదుగా ?

సత్య : వ్రతాలు లేవని మనకు హృదయాలుకూడా లేకపోయే యంటారా ?

శ్రీహ : హృదయాలువుంటే మాత్రం రహస్యంగా మనం అనుకున్నమాటకు సంఘంకూడా సమ్మతించాలిగా ?

సత్య : సమ్మతించక సంఘం మగవాళ్ళుచేసే మహాద్రోహాల్ని మరుగుపుచ్చి ఆడవాళ్ని అధఃపతనం చేయమని శాసిస్తుందంటారు.

శ్రీహ : శాసించకపోతే! వేలాదిరూపాయలు వ్యయంచేసుకుని విద్యుక్తంగా వివాహాలు యెందుకు చేసుకోవలసి వస్తూవుంది చెప్పు. మరి ?

సత్య : సంఘశాసనాన్ని అంత తూచాతప్పకుండా శిరసా వహించాలనేవారు, అప్పుడు ఆ అఘాయిత్యపు కార్యానికి యెందుకు అవలంబించేరు ?

శ్రీహ : అవలంబించేనుగనుకే నీకుయిచ్చిన బంగారం అరణంగా వుంచుకుని పుట్టింటికిపోయి యిష్టమయినవాణ్ణి వివాహం చేసుకోమంటున్నాను.

సత్య : (నిర్భయంగా) పునర్వివాహం చేసుకోమని మానవత్వంవున్న మగవారు అనవలసిన మాటేనా ?

శ్రీహ : అందుకని కరుస్తుందని తెలిసి కాలసర్పాన్ని కౌగలించుకోమంటావ్ !

సత్య : లేక ! లోకప్రవాహానికి లోనయి కాకిలా కలకాలం బ్రతకడం ప్రయోజనం అంటారా !

శ్రీహ : (హేళనగా) ఓహో! లోకులేదో అంటారని నా భవిష్యత్తునుమాత్రం పాడుచేసుకోలేను.

సత్య : (చీదరించుకుంటూ) ఛీ! భగవంతుడు పశువులకు యివ్వని యుక్తాయుక్తవివేకాన్ని మానవులకు యిందు కేనా యిచ్చింది?

శ్రీహ : ఇచ్చేడసి చిచ్చులో ఉరకమనేగా నువ్వు నాకిచ్చే సలహా!

సత్య : చావవలసినగడువు సమీపిస్తే చావక యెవరయినా మృత్యుంజయులయి చిరకాలం జీవిస్తారుకాబోల్ను?

శ్రీహ : జీవించరని యెవరూకూడా మృత్యుదేవతను ఆహ్వానించి ముద్దు పెట్టుకోరులే!

సత్య : (విసుగుదలతో) వీలు చాలు లేకుండా అంధవిశ్వాసంతో మీరు ఆడేమాటకు అర్థంలేదు

శ్రీహ : (మొండితనంగా) అర్థమో గిర్థమో నాకు అక్కఱ లేదు. బ్రతికిబాగుంటే యీ యేడేళ్ళుదాటేకయినా నిర్భయంగా వివాహం చేసుకుంటాను.

సత్య : (తిరస్కారభావంతో) యాభై యేళ్ళుదాటినా మీరే అరిషడ్వర్గాన్ని అరికట్టుకోలేక అన్నం పున్నం యెరుగని నా ఆశాజ్యోతిని ఆర్పివేసి, మరోకన్నను కట్టుకో వాలనే కాంక్షకలిగివున్నారే! పదిహేనేళ్ళ పసుచు నయిన నాకు యెన్ని ఆశలు వుంటాయో మీ రేమయినా ఆలోచించేరా?

శ్రీహ : ఆలోచించక నిన్ను శాంతులు లేని కఱ్ఱబొమ్మ అనుకుంటే వివాహం చేసుకోమని యెందుకు చెబుతాను?

సత్య : (చిరాకుగా) ఛీ! కామాంధులయి నా కన్నెత్వాన్ని కలుషితంచేసి సిగ్గులేనివారిని ఛీ! ఛీ! లు యేంచేస్తాయనేగా? మారుమనువు చేసుకోమని మరీమరీ చెప్పడం?

శ్రీహ : (కోపంతో) ఏఁవిటి! ప్రేలేవ్! యింతవరకు నీ వేం అంటున్నా శాంతంగా సమాధానం చెబుతూ వస్తున్నందుకు నీ వ్యవహారం శ్రుతి మించిపోయింది.

సత్య : (నిర్లక్ష్యంగా)హుం! శ్రుతి మించిపోయింది! ఆడదంటే మీ భోగ విలాసాలకి అనువయిన యంత్రం అనిగాబోల్ను మీ అభిప్రాయం?

శ్రీహ : ఆమాట నే అన్నానా ?

సత్య : (నిస్సంకోచముగా) అనకపోతే వినండి. నేను నీళ్లు కూడా పోసుకుని నెల దాటింది. సిగ్గువిడచి యీరహస్యం కూడా మీతో చెప్పవలసుంటున్నాను.

శ్రీహ : (కంగారుపడి) ఆఁ! నిజమేనా ? యిప్పుడేఁవిటిగతి ?

సత్య : (ధీమాగా) ఈ మన చిదంబర రహస్యం పదిమంది నోళ్లో పడకముందే వివాహమాడి పరువు నిలబెట్టుకోవడంకంటే గత్యంతరం యేఁవీలేదు.

శ్రీహ : (వెటకారంగా) అంటే! నీ కంటిలో నే వ్రేలు పెడతాను నా నోటిలో నువ్వు వేలు పెట్టు" అంటావ్!

సత్య : (నిరాశతో) కాదని మాయని మచ్చతో మన వుభయ వంశాల్ని మట్టిపాలు చేస్తారా ?

శ్రీహ : (ఆలోచించి) కనుక మన వుభయులికికూడా అపాయంలేని వుపాయం యేదయినా వుంటే...

సత్య : ఊహించి మీరే చెప్పండి !

శ్రీహ : (ముభావంగా) ఆ కార్యంకాస్తా...కళ్ళు మూసుకుని కానిచ్చి... మామూలుగానేనువ్వు మాయింట్లోనే వుండిపోతే ! యీ యేడేళ్ళు దాటగానే వివాహం చేసుకోవడానికి నాకు యేఁవీ ఇబ్బంది వుండదు...

సత్య : (విసుగుదలతో)విషయం యేఁవిటో ఇతమిత్థమని చెప్పకుండా యేఁవిటండి ? మీ వ్యంగ్యోపన్యాసం ?

శ్రీహ : (మందస్వరముతో) ఉపన్యాసం యేం వుందండీ ? గ...ర్భ...వి...చ్ఛి...త్తి.

సత్య : (ఉలిక్కిపడి చెవులు మూసుకుని, హరి! హరి! గర్భవిచ్ఛిత్తా ! ఎంత అమానుష కార్యం ! ఎంత హృదయ విదారక విషయం ?

శ్రీహ : (నిర్లక్ష్యంగా) ఏం? పెద్దపెద్ద కొంపల్లో సర్వసాధారణంగా జాగుతూవున్న సామాన్య కార్యమేగా? అది!

సత్య : (తెగింపుతో) కావచ్చు. అందుకని నన్నుకూడా పతితలా పాపకార్యం చేయమంటారా ?

శ్రీహ : చేయక శరణ్యం యేముంది చెప్పు ? సత్యావతీ !

సత్య : (ధిక్కారముగా) లేదని, తన సంతానాన్నే పొట్ట బెట్టుకొను ఆడుబ్రతాచుపాములా యే మాతృ హృదయం భ్రూణహత్యామహాదోషానికి పూనుకుంటుంది ? కారుణ్యమూర్తి అయిన కన్నతల్లి కడుపుతీపి మీ మాలిన్య హృదయానికి మచ్చుకయినా వుండదన్న మాట ?

శ్రీహ : (ఉద్రేకంతో) లేక కాదే! సత్యవతీ ! సాధ్యంకాక.

సత్య : సాధ్యం కాకపోతే !

శ్రీహ : సత్వరం తెగతెంపులు చేసుకుని నాయిల్లు విడిచి పెట్టి వెళ్ళక తప్పదు.

సత్య : (ఉద్రేకంతో) తప్పదట! కలిగినవారి గుట్టు గడపదాటదనే కండకావరంతో మీరు లోకుల కళ్లు మూయగలరేమోగాని, లోకేశ్వరుని కళ్ళుమాత్రం మూయలేరు. తెలుసా ?

శ్రీహ : (తిరస్కారంగా) తెలుసులే ! అందుకని ?

సత్య : అందుకని భగవంతునికయినా భయపడి ప్రవర్తించక పోతే ! మీకు యిహపరాలు రెండూ వుండవ్.

శ్రీహ : (వెకిలినవ్వుతో) ఉండకపోతే వుండకపోతాయ్ ! నువ్వు మాత్రం వైరాగ్య వాక్యాలు కట్టిపెట్టి ముందు యిక్కణ్ణుంచి వెళ్ళిపోవాలి.

సత్య : (దీనంగా) నమ్మినవారి జీవితాన్ని నాశనం చేయడం న్యాయం కాదండి !

శ్రీహ : (కోపంతో) న్యాయమట న్యాయం ? ఆట్టే ప్రేలక యిక్కణ్ణుంచి వెళతావా ? వెళ్ళవా ?

సత్య : (తీవ్రంగా) ఎందుకని వెళ్ళాలి ? ప్రత్యక్షంగానో. పరోక్షంగానో ! మీరు నన్ను పెండ్లాడేరు. గనుక యీ యింట్లో వుండడానికి నాకుకూడా మీతో బాటు శాస్త్రసమ్మతమయిన సంపూర్ణహక్కు వుంది.

శ్రీహ : (వెకిలిగా నవ్వి) అదా సంగతి ! యింట్లోతిని యింటి వాసాలు లెక్కపెట్టినట్లు నీ వ్యవహారం అంతవరకూ వచ్చిందేం ?

సత్య : రాక ? లేదని రచ్చకెక్కి ఋజువు చేయగలరా ?

శ్రీహ : (తిరస్కారంగా) ఋజువు చేయవలసిన అగత్యం నాకు యేం పీలేదు. వెళ్ళనంటే వెళ్ళగొట్టడమే నా విధానం.

సత్యి : (ఆవేశంతో) ఆడుదంటే ! అబలకదా ? మన ఆటలు సాగుతాయి అనుకున్నారేమో కాని భారతావనిలో బుట్టిన అభిమానవతియైన యే ఆడుదయినా ఝాన్సీ లక్ష్మిభాయి, రుద్రమ్మ, నాగమ్మ, మల్లమ్మలా సమయం వస్తే అబల సబలయై యే సాహసకార్యం చేయడానికయినా వెనుదీయదు.

శ్రీహ : (కోపంతో) వెనుదీయదేం? (చెంపపైకొట్టి) ఇప్పుడయినా వెళతావా ? వెళ్ళవా ? చెప్పు ?

సత్య : (నిర్భయంగా) మీరేంచేసినా వెళ్ళనని యిప్పుడేగా చెప్పేను ? వినబడలేదా ?

శ్రీహ: (కోపావేశంతో) ఎంత బండకెత్తి మాట్లాడుతున్నావ్. ఇదిగో ! యిప్పుడే నీ పీకి నులిమి పెరట్లో పాతివేస్తా చూడు (మీదకిపోయి పీకి నులుమును.)

సత్య : (బలవంతంగా తప్పించుకుని గట్టిగా నెట్టును.)

శ్రీహ : (పడిపోయి లేచి కోపంతో) దుర్మార్గురాలా! చూడు యిప్పుడు నీ రక్తం కంటచూస్తాను. (మొలలోని బాకు తీసి పొడవబోవును)

సత్య : (తప్పించుకొని ఆవేశంగా) ఆగండి ! హత్య చేస్తే మాత్రం అర్ధబలం అంగబలం గల నన్ను అదమా యించే అధికారులు యెవరనేగా మీ అహంభావం ?

శ్రీహ : అవును ఆమాట అక్షరాలా నిజం. ఈక్షణంబయులు దేరి వెళ్ళిపో? నిమిషం నిలబడ్డావా? నిన్నంతం చేయక మానను ఏం? కదలవేం?

సత్య : (కొంచెం దూరం వెళ్ళి నిలబడి ఆవేశంగా) కదులుతా నా ప్రాణంమీది ఆశతో కాదు నేను కాలు అవతల పెట్టడం ? నాఆత్మ ప్రభోధం ప్రకారం మరో ఆదర్శం కోసం నే నీక్షణం మీ యిల్లు విడచిపెడతాను. ఇవిగో నాగపాశాల్లాంటి మీ నగలు నన్నురక్షించవ్! (తీసి మీదకు గిరటవైచి) సావిత్రి, దమయంతి, సీత, రుక్మిణి మొదలయిన పతివ్రతామణుల్ని కన్న భరత మాత పవిత్రగర్భాన్ని పుట్టిన సత్యవతి కనకానికి తన శీలాన్ని అమ్ముకున్న గణిక మాత్రం కాదని మీ పాప

దేవత భయంకర నృత్యంచేస్తూ మిమ్మల్ని పరాభవించిననాడయినా పశ్చాత్తాప పర్వతం మీ హృదయంలో పెటేలున ప్రేలి, తుఫాను చెలరేగి మీకు కనువిప్పు కలిగింపకపోదు. (వేగంగా వెళ్ళిపోవును)

శ్రీహ : (నిర్ఘాంతపోయి నిలబడి నిట్టూర్పు విడిచి నగలు యేరుకుని యిటునటు తిరుగుతూ తనలో) కర్మంచాలక యీ గయ్యాళిగంప యీరాత్రి యే నూతిలోనో, గోతిలోనో దిగి నామెడమీదకు కత్తి తీసుకుని రాదు గదా? (పెద్దనవ్వు నవ్వి) చచ్చింది చచ్చుపీనుగు. హేమాహేమీలందరు యేకమయినా లక్ష్మీ ప్రసన్నుణ్ణయివున్న నాకాలిగోరు కదపలేరు.

(తెరలో ఆకాశవాణి)

ఉ॥ స్నేహముఁజేసి దుష్టమతి చెప్పిన మాటను లెక్కసేని; సం
దేహముఁజెంది కాదనక దివ్య మనస్వినిఁదూలనాడి, దు
స్సాహసకార్యమున్ సలిపి చావక చచ్చిన వాఁడవైతివో
ద్రోహి! త్వదీయ జన్మమిక దోషపరీతము కాకపోవునే?

శ్రీహ : (విని భయకంపితుడగుచూ వెళ్ళిపోవును)

(తెర పడును)



శ్రీః

# ( ద్వితీయదృశ్యం )

(శ్రీహరిరావుగారి మేడ కచేరీ సావడిలో శ్రీహరిరావుగారు కుర్చీలో కూర్చొని పుస్తకం చదువుకుంటూ వుంటారు.)

సీ॥ ఎంతటి యుద్యోగి నేన్వాశవర్తిగా
  నొనరింప లోహబంధనము ధనము
గ్రామ కలహ పరిష్కారంబుఁ గావింపఁ
  దగవరిఁజేయ సాధనము ధనము
పగతురఁ గష్టాలపాలు జేయింపంగ
  ఘనకోపవహ్నికిం ధనము ధనము
స్వాభిలాషోష్ణతఁ జల్లార్చి సంతృప్తుఁ
  బొనరింప శీత చందనము, ధనము

తే॥ అనవరత సర్వకార్య పూరణము ధనము
ప్రబల శత్రు భయైక వారణము ధనము
అనుపమానంద సౌఖ్యవర్ధనము ధనము
వినుత గౌరవస్థితికిఁ గారణము ధనము॥

గణ : (ప్రవేశిస్తూ) ఆ పద్యం చెప్పినకవి యెంత అనుభవశాలి కాకపోతే ఆలా చెబుతాడు ?

శ్రీహ: మరి యేమనుకున్నావ్! ఈ నవనాగరికతాయుగంలో రాజకీయ వాదుల రాద్ధాంతాను; వేదాంతవేత్తల సిద్ధాంతాలు; ప్రజా ప్రతినిధుల ప్రగల్భాలు; అధికారుల ఆర్భాటాలు ఆకవి చెప్పినట్లు ధనవంతుల ముందు దాసోహం అనక తప్పదు.

గణ : తప్పనిమాట తథ్యం రావుగారు !

శ్రీహ : యింతకు యీవేళ యింత ఆలస్యంగా రావడానికి కారణం ?

గణ : ఇంకానయం ! యెంత తొందరపడితే యిప్పటికి రాగలిగే నంటారు ?

శ్రీహ : ఏం ? యీవేళేం గొడవ వచ్చింది ?

గణ : (కూర్చుంటూ) ఏం చెప్పమంటారు ? యీ వేళ మా వాళ్ళకు ఆదివాదం గదండి !

శ్రీహ : మీ వాళ్లకు ఆదివారం అయితే ! నాలుగు మెతుకులు తిని వచ్చేదానికి నీపనేముంటుంది ? ఇంట్లో.

గణ : లేకపోవడం యేమిటి ? ఆదివారంనాడు మా గృహలక్ష్మికి కావలసినవన్నీ అందిస్తేతప్ప, యే వస్తువు లోటుచేసినా ప్రసవించిన పెద్దపులిలా నా ప్రాణాలు కొరుక్కు తినేయదూ !

శ్రీహ : (నవ్వి) ప్రతి ఆదివారం నీకీ ప్రమాదం తప్పదన్న మాటేగా ? పాపం !

గణ : తప్పదు బాబూ ! తప్పదు. బ్రహ్మదేవుడు నా మెడకు యీ బ్రహ్మరాక్షసిని కట్టబెట్టేడు. యేమనుకుని యేం లాభం యింక ?

శ్రీహ : ఆదిలో ఆడవాళ్ళి నెత్తికెక్కించుకుని యిప్పుడు దిగమంటే యెలా దిగుతారు చెప్పు! మరి ?

గణ : (నిస్పృహతో) ఆడవాళ్ళతో బాధలు మీకు లేవు. గనుక అలా చెబుతారు బా[illegible] స్తుంది మోతబరువు".

శ్రీహ : ఏంవిటమ్మా తెలిసేది ? శింగినాదం.

గణ : అబ్బబ్బ ! అలా అనకండీ ! నాయిల్లాలితో నే పడే బాధలు యేకరువుపెట్టి చెప్పాలంటే ! యేడాది సరిపోదు.

శ్రీహ : (జాలిగా) అలాగటయ్యా ! పాపం ! ఎప్పుడూ చెప్పేవుగావేం ?

గణ : (బాధగా) ఏం చెప్పమంటారు ? యింటిగుట్టు యెవరికి చెప్పగూడదని యింతవరకు మీకుకూడా చెప్పలేదు గాని; యేనాటికానాడు యెన్నెన్ని ఆహార పదార్థాలు యింటికి తెచ్చిపారేస్తున్నా యివిలేవు.. అవి లేవు... అంటూ నా యెముకలు నమిలి పారవేస్తుంది.

శ్రీహ : (జాలిగా) పాపం !

గణ : అందులోనూ, యీ ఆదివారంనాడు అయిదు రూపాయలు అప్పో చప్పో చేసి తెచ్చి ఖర్చుపెట్టినా ! ఏదో ఒకలోటు కనపర్చి నన్ను వెక్కిరించక మానదు.

శ్రీహ : ఇంతకు మీయావిడ నిన్ను ఆట బొమ్మలా ఆడిస్తుందంటావ్ ! అంతేగా ?

గణ : అబ్బెబ్బె ! ఆటబొమ్మలా కాదుబాబు ! ఆమె మాట కాదన్నానంటే పాత చెప్పులా పరిగణించి నా పరువు ప్రతిష్ఠల్ని బజారు పాలుచేస్తుందంటే నమ్మండి.

శ్రీహ : నమ్మడానికేం గానీ, అలాంటి ఆవిణ్ణి పెళ్ళెందుకు చేసుకున్నావ్ ?

గణ : ఏం చేయమంటారు ? మేనరికమని నా మెళ్ళు విరచి కట్టబెట్టేరు, మా పెద్దవెధవలందరు యేకమయి !

శ్రీహ : పూజలు పునస్కారాలు చేసే ఆవిడకి భర్తను భగవంతుణ్ణిగా పూజించాలని తెలియకపోవడం యేం తెలివితక్కువతనం అంటావ్ !

గణ : ఆ పూజలే బాబు నా పుట్టి ముంచాశాయి.

శ్రీహ : (ఆశ్చర్యంగా) పూజలేంచేశాయి ?

గణ : ఏంచేశాయంటారా ? పాశ్చాత్య నాగరికతా ప్రభావం యింత విచ్చలవిడిగా తలవిరబోసుకుని స్వైరవిహారం చేసే, యీ వైజ్ఞానిక, యుగంలో కూడ స్నానాలని సంధ్యలని, పూజలని పుణ్యాలని వెట్టిబుఱ్ఱి నమ్మకాల్తో మగవాళ్ళను వేధించుకు తినడానికిగానీ, యెందుకు కలసివచ్చేవండీ యీ పిచిచ్చి పన్లు.

శ్రీహ : అవును పిచ్చి పన్లు కాకపోతే ! యింత ముందుకు పోయిన యీ యిరువదవ శతాబ్దంలోకూడ మన హిందూ స్త్రీలకి యీ బూజుపట్టిన పూర్వాచారాలు పోకపోవడం యేం గ్రహచారమంటావ్ చెప్పు ?

గణ : గ్రహచారం కాకపోతే విదేశీయుల్లా మనవాళ్ళుకూడా యీపాటికి యెంతో ముందుకు పోయివుందురు గదండి!

శ్రీహ : ముందుకు పోవడమే కాదు అన్ని దేశాలవాళ్ళకి ఆదర్శప్రాయంగా ముందడుగు వేస్తూ వుండకపోదురా ?

గణ : ఆఘోరించారులెండి !

శ్రీహ : ఆ విషయం కట్టిపెట్టి ముందు అమర్‌నాథ్ విషయం యేం ఆలోచించావో చెప్పు ?

గణ : ఆలోచించి నన్ను యేంచెప్పమంటారు ?

శ్రీహ : సత్యవతి పీడ విరగడయిపోయినా వీడి పీడమాత్రం మనల్ని విడిలేటట్టు కలిపించడంలేదు.

గణ : అందుకే అనుభవజ్ఞులు ఎప్పుడోవచ్చే అపాయానికి ఇప్పుడే వుపాయం ఆలోచించుకోమన్నారు.

శ్రీహ : ఆలోచించేదేముంది? వీడు మనయెదుట వున్నాడంటే యిప్పణ్ణుంచీ యీర్ష్య పెట్టుకుని పెద్దవాడయ్యాక ప్రళయం తీసుకుని రాకమానడు.

గణ : అందుకు నాకు ఒక చిటకాతోచింది చెప్పమంటారా!

శ్రీహ : చెప్పమనేగా ? అ కిటుకు యేదో !

గణ : ఏం వుందండి చదువుకని వంకపెట్టి మద్రాసు పంపి వేయడమే.

శ్రీహ : అది మంచి వుపాయమే గాని, చదువుకుని యేకులాగ వెళ్ళినవాడు మేకయి తిరిగి రాడుగదా ?

గణ : (వెకిలిగా నవ్వి) అంటే! చదువుకుని మీ మేనల్లుడు లోకజ్ఞానం సంపాదిస్తాడనా మీ సందేహం ?

శ్రీహ : అవును.

గణ : అలా యెప్పుడూ జరుగదు. పట్టణం వెళ్ళి పదేళ్ళపాటు స్వేచ్ఛగా తిరిగిన కుఱ్ఱవాడు విలాసానికి లోనయి పాడయి పోతాడుగాని చదువుకుని బాగుపడేవాడు కోటికి ఒక్కడుండడు. అందులోనూ చేతినిండా డబ్బు వున్నవాని మాట వేరే చెప్పనక్కరలేదు.

శ్రీహ : అవునవును. యీ వుపాయం మంచిదే!

గణ : మందేఁవిటి నిక్షేపంలాంటిది.

శ్రీహ : కాబట్టి చతురోపాయాలు ఉపయోగించి యీ వేళో రేపో వీణ్ణి మద్రాసు పంపేకార్యం నీవల్లే కావాలి.

గణ : ఆ భయం మీకేఁవీ అక్కరలేదు. తిమ్మిని బొమ్మని పెట్టి నే పంపివేస్తా గదండి !

శ్రీహ : పంపి పదేళ్ల పాటు మద్రాసులోనే వీణ్ణివుంచివేశామా? మన రహస్యపు కార్యాలన్నీ నిరాటంకంగా నెరవేరి పోతాయి!

గణ : నెరవేరడమే కాదండి నిస్సందేహంగా పదిరాళ్ళు రా బట్టుకుంటాంకూడాను.

శ్రీహ : సరే ! నా భోజనానికి వేళ అయింది వెళ్ళిరానా ?

గణ : చిత్తం నాకూ్కడ తలమునిగేటంత జమాఖర్చులువేసే పనివుంది నేనూకూడా పోతాను. (వెళ్ళును)

(తెర పడును)

శ్రీః

# ( తృతీయ దృశ్యం )

(సర్వోదయ సమాజాశ్రమం ముఖద్వారమున "సర్వోదయ సమాజాశ్రమం" అను బోర్డు, హాలులో బుద్ధుడు, అశోకుడు, రాజారామ మోహనరాయలు, రవీంద్రుడు, వివేకానందస్వామి, గాంధీ, కందుకూరి, గురజాడ మొదలగువారి ఫోటోలు ఉండును. ఆశ్రమాధిపతి దయానంద స్వామి యథోచితాసనముపై కూర్చొని పాడుతూ వుండును.

పాట - హంసానందిని (హిండోల్) జంపె

విశ్వమోహనమూర్తి! గాంధీజి!
విశ్వ విశ్రుతకీర్తి! బాపూజి!

1. సర్వఖండములందు, సర్వ దేశములందు
సర్వవంద్యుడవౌచు, సత్కీర్తిగొన్నావు ॥విశ్వ॥

2. నీ శాంతి సమరంబు; నీ సత్యమార్గంబు
విశ్వంబ దెన్నటికి; విస్మరింపలేదు ॥విశ్వ॥

3. నీ పరేంగిపశక్తి: నీ చలోక్తులరక్తి
నీ సుధామయసూక్తి; నిరుపమానంబహో! ॥విశ్వ॥

4 నీ యహింసామంత్ర నియత ప్రభావంబు
మానవాతీతంబు; మానైక్య బోధ్యంబు ॥విశ్వ॥

దయా: (పాట ముగించి సభ్యులనుద్దేశించి) నాయనలారా! సహజీవన సౌలభ్యార్థం మనుకాలంనుంచీ మనకు ఆయా వృత్తుల్ననుసరించి కులమతభేదాలు యేర్పడ్డాయి. తరువాత మన వుచ్చనీచ ప్రవృత్తుల్నిబట్టి స్పృశ్యాస్పృశ్యభావాలు యేర్పడి కాలం మారినా అవి మాత్రం మార్పుచెందక రానురానూ వెఱ్ఱితల

లేసి మహత్తరమయిన మానవత్వాన్ని మరపించి వేశాయ్. నిజం ఆలోచిస్తే "జన్మనా జాయతే శూద్రః కర్మణా యతే ద్విజః" అను వేదసూక్తిని అనుసరించి మానవుల్లో.

సీ॥ కని ప్రేమఁ బెంచిన కనని జనకులను
 భక్తిసేవింపని వాఁడు మాల
అగ్నిసాక్షిగఁ గొన్న యర్థాంగివిడి పర
 భామలఁగూడెడు వాఁడు మాల
మాతృదేశ ప్రేమ మరచి తద్ద్రోహంబుఁ
 బలపరచుచుండెడు వాఁడు మాల
పరజనౌన్నత్యంబుఁ బరికించి యీర్ష్యతో
 వర్తించుచుండెడు వాఁడు మాల

తే॥ బ్రహ్మ వైశ్య క్షత్రియ శూద్ర భావములిల
వర్తనంబును బట్టియే వచ్చుఁగాని
పుట్టువున నెవ్వరికిఁగూడ పొసఁగవెపుడు
పూతగుణులారా! భారత పుత్రులారా!

డాక్ట : (ప్రవేశించి) నమస్కారమండీ స్వామి!

దయా : (చూచి) డాక్టర్ గారా? అయితే! ఆ పద్దెనిమిదవ నెంబరు గదిలోవున్న ఆ అభాగిని ఆరోగ్యం పాపం యీ వేళ యెలావుందండి?

డాక్ట : ఇంక ఆమె ఆరోగ్యంగురించి మనం అంతగా ఆందోళన పడవలసిన అవసరం లేదు స్వామి!

దయా : అయితే! పాపాయి చాలా అదృష్టవంతురాలన్న మాట.

డాక్ట : అంమవల్లే ! తల్లికికూడా గండం తప్పిపోయింది అను కోండి స్వామి !

దయా : అవును ప్రసవించిననాటి ఆమె పరిస్థితిచూచి నాకు చాలా భయం వేసింది సుమాండి.

డాక్ట : ఆ భయం మీకేకాదు మీతో చెప్పలేను గాని నాకుకూడా లేకపోలేదు స్వామి !

దయా : అందుకే ఆయువున్నవారిని అడవిలో పారవేసినా పోని రాదన్నారు.

డాక్ట : ఆమాట నిజంస్వామీ ! "శివునిఆజ్ఞలేక చీమయినా కుట్టదు" అని యెందుకంటారు పెద్దలు ?

దయా : జగదీశ్వరుని పరిపూర్ణానుగ్రహం వున్నవారిని చీమ మాత్రం యెలా కుడుతుందండి ?

సీ॥ జాతిలో జన్మించి జాతిలోఁ బెరిగెడు
భేకావళికిఁ దిండి పెట్టువాఁడు
మాతృ గర్భమునందు మసలెడు శిశువున
కాహారమొసగూర్చు నట్టివాఁడు
కాననఁదిరుగాడు ఖగమృగావళులకు
నన్న ప్రదాతయై యలరువాఁడు
జలమున వసియించు జలచరకోటికి
జీవనాధారుఁడై జెలఁగువాఁడు

తే॥ జంగమ స్థావరాత్మక జగముఁదనదు
కుక్షి కుహరంబు నందెంచుకొనిన వాఁడు
ప్రోవకుండునె? దీనులఁ బూర్ణకరుణ
మూతిఁబెట్టిన దేవుఁడే మేతబెట్టు

డాక్ట : అవునుస్వామి! మీరు శెలవిచ్చినట్లు నాయబోసిన వాడు నీరుపోయక మానతాడా? చెప్పండి!

దయా : డాక్టర్‌గారు! పాపాయికూడా పాలుత్రాగుతూ ఆనందంగా ఆడుకుంటూవుంది గదండి!

డాక్ట : తమ ఆశీర్వాదంవల్ల హాయిగా ఆడుకుంటూ అప్పుడే ముద్దులు మూటకట్టుతూవుందికూడాను.

దయా : ఎందుకుండదు? పాపాయి ముఖవర్చస్సునుబట్టి చూస్తే! గొప్ప భాగ్యవంతురాలై, భారతనారీ లోకానికి ఆదర్శనారాలుఅయి తీరుతుందనక తప్పదు.

డాక్ట : కాకపోతే! "మల్లిపూవు పుట్టగానేయింపు, వుల్లిపూవు ముట్టగానే కంపు" అని వూరకేఅంటారా? స్వామి!

దయా : డాక్టరుగారు! ఇంతవరకు ఆ అభాగిని మనకు తన వృత్తాంతం ఇతమిత్థమని యేంవీ చెప్పలేదు గదండి!

డాక్ట : మనకేకాదండి! తనను మన ఆశ్రమానికి తీసుకుని వచ్చిన ఆరైతులికికూడా యేమీ చెప్పలేదటస్వామి!

దయా : (ఆశ్చర్యంగా) ఆరైతులు ఆనాడు ఆమె విషయమై మీతో యేం చెప్పేరండి?

డాక్ట : ఏం చెప్పేరంటారా? యీమె మాగ్రామంవచ్చి మా పదిమందికి తలలో నాల్కగా ప్రవర్తిస్తూ, ప్రపంచ పరిస్థితుల ప్రవర్తనంగురించి ప్రబోధగీతాలుపాడుతూ, కాలక్షేపం చేయడంతప్ప తన జీవితవిశేషాలు యేంవీ చెప్పలేదు" అని వాళ్ళు చెప్పిన విషయాలు స్వామి.

దయా : ఎవరికి తన జీవితవృత్తాంతం చెప్పకపోవడం విచిత్రం గావుంది సుమాండి !

డాక్ట : విచిత్రం కాకపోతే ! నిన్నవుదయం లాలిపాట పాడుతూ ఆమె పాపాయిని లాలిస్తూవుండగా నేను అటు వెళ్ళి "మా ఆశ్రమనియమం ప్రకారం మీ పేరు, మీ వూరు చెప్పాలి" అనేసరికి నిమిషంసేపు నిశ్చేష్టురాలయి నిలబడి "క్షమించండి డాక్టరుగారు" అంటూ కన్నీరు మున్నీరుగా వలపోస్తూ, గభాలున తన గదిలోకి వెళ్ళిపోవడం యేఁవిటంటారు ?

దయా : (తలపంకించి) అయితే ! ఆమె జీవితచరిత్రలో వెల్లడి చేయరాని విషాధఘట్టం యేదో వుండాలి. లేకపోతే ! కనీసం తనపేరు చెప్పడానికికూడా సంశయించవలసిన కారణం యేమై వుంటుంది గ్రహించండి డాక్టరుగారు!

డాక్ట : కారణమో ! ఆమె గ్రహచారమో ! చెప్పలేను గాని స్వామి ఆమె నడవడినిబట్టి ఆలోచిస్తే ! ఆదర్శ గృహిణీ లక్షణాలుతప్ప అవగుణాలుమాత్రం......

దయా : (అందుకుని) లేనిమాట సత్యం ఆవిషయం నేను ఆదిలోనే కనిపెట్టేనుగదండి.

దయా : కాబట్టి సావకాశంగా, నేఁవో రేపో మీరే స్వయంగా ఆమె వృత్తాంతాన్ని అడిగి తెలుసుకోండి ! స్వామి !

దయా : సరే ! నాతో గ్రామాంతరం వెళ్ళాలని చెప్పేరు వెళ్ళలేదా ? డాక్టరుగారు,

డాక్ట : వెళ్లకేమండి ! పదిగంటలకు బయలుదేరివెళ్ళి పని చూచుకుని ఇప్పుడే వచ్చాను స్వామి !

: సరి ! సరి ! ఆశ్రమరోగులందరు మిమ్ము యెదురు చూస్తూవుంటారు పాపం ఒకసారి చూచిరండి.

డాక్ట : నమస్కారమండి స్వామి ! (నమస్కరించి వెళ్ళును)

దయా : (సభ్యుల నుద్దేశించి) నాయకులారా? సంఘసంస్కార సమస్యల్లో పునర్వివాహసమస్య చాలా ప్రధాన మయింది ప్రచండ సంఘశాసనంతో జల్లెడమీద బండిలా నడచిపోతూవున్న సముగమున దురాచార ప్రవాహానికి మొదట రాజారామమోహన్ రాయలు గట్టువేసి గణుతికెక్కారు. తరువాత కందుకూరి వీరేశ లింగంపంతులుగారు "యౌవనదశలోవున్న పురుషు లికి భార్యావియోగం, స్త్రీలకిభర్తృవియోగం ప్రాప్త మయి వివాహేచ్ఛ తమకున్నచో, విధిగా వివాహం చేసుకునితీరాలి" అని వివరించారు. అనేక అనాథ శరణాలయాల్ని కూడా స్థాపించారు. చాలామంది అనా థల్ని, సనాథల్ని చేసి సఫలీకృత జీవులయ్యారు. కాని కొందరు తలిదండ్రులు తమ పూర్వాచారాల్నే సదా చారాలంటూ, మూఢ్యవాదాలు సాగిస్తూ, స్వార్థాంధు లయి పాతచీపురుకట్టకి పట్టుకుచ్చుకట్టినట్టు, ముక్కు పచ్చలారని తమ ముద్దుబిడ్డల్ని, ఘూరుపొమ్మంటూ కాడు రమ్మంటూవున్న, యేముడుకాళ్ళ ముస

లయ్యాకో "కూటికి చేతులు, కాటికి కాళ్ళు చాచుకుని కూర్చున్న యే దీర్ఘవ్యాధిగ్రస్థునికో ముడిపెడుతున్నారు. అమ్మ గృహప్రవేశం చేసేసరికి అయ్య శ్మశానప్రవేశం చేయడంతో అమ్మలక్క లందరుచేరి వల్లించిన వైరాగ్యవాక్యాల్తో ఆబాలవిధవను ఓదారుస్తూ, పసుపుబట్టల్తో ఆమె మాంగల్యాభరణాల్ని ఒలిపించి, పాపం యింక ఆమెను జీవితాంతం జీవచ్ఛవంలా జీవించమని శాసిస్తున్నారు. యేబాల వితంతువయినా, యింద్రియదార్బల్యంచేత బలీయమయిన ప్రకృతికి లొంగిపోయి, పరోక్షంగానో, ప్రత్యక్షంగానో పాపపుపనికి పాల్పడి భ్రష్టురాలుకాగా, తరువాత తలిదండ్రులు తలమోదుకుని తమ లోకాపవాదాన్ని తప్పించుకోగలరా ? అంచేత యిప్పట్నుంచి అయినా మీా చాదస్తపు సనాతన సంకల్పానికి స్వస్తి చెప్పి కాలానుగుణ్యంగా బాల్యబలవద్వివాహాల్ని మాన్పించండి ! స్త్రీనరభ్రూణశిశుహత్యాది ఘోర కృత్యాలికి తావీయక పునర్వివాహాల్ని పూనికతో చేస్తూ చేయిస్తూ పాణిగ్రహణ ప్రయోజనాల్ని ఫలప్రదంచేయండి. యెందుకంటూరా ?

సీ॥ పురుషార్థ సాధనంబునకుఁ జేరెన్నికఁ
గన్నయట్టిదియోాచుఁ గాలుఁబెడ్లి
ఆశ్రమవాస సౌఖ్యాపాదనమునకు
నాధారభూతమై యలరుఁబెండ్లి

# తృతీయ దృశ్యం

అతిథిజనౌఘ హృదానంద సంధాన
　　నిరతాలవాలమై నెగడుఁ బెండ్లి
కాలక్రమాగత కష్టపాథోరాశిఁ
　　దరియింప నౌకయై తనరుఁ బెండ్లి
తే॥ అట్టి పెండిలి సానుకూల్యంబు గలుగు
నెడల క్షీరనీర న్యాయ మదరు దంప
తులకుఁ గాకున్నచో మేటిదొసఁగు పొసఁగుఁ
బుణ్య భారతమాతృ సత్పుత్రులారా !

డాక్ట : (తొందరగా ప్రవేశించి) నమస్కారమండి స్వామి !

దయా : (చూడు ఆశ్చర్యంగా ఏఁవండి డాక్టరుగారు! వెంటనే తిరిగివచ్చారు ?

డాక్ట : పాపం ! ఆ అభాగిని వెళ్ళిపోయిందటండి !

దయా : (ఆతృతగా) ఆ ! వెళ్ళిపోయిందా ?

డాక్ట : అవునండి స్వామి ! తన జీవితపు పుట్టు పూర్వోత్తరాలు యెవరికి చెప్పడానికి వీల్లేని యిబ్బంది యేదో వుండి యిలా రహస్యంగా వెళ్ళిపోయిందంటారా ?

దయా : రహస్యంగా వెళ్ళిపోవడానికి కాటుక బొట్టు పెట్టుకుంటూ గౌరీ దేవిలా కలకల్లాడే ముఖంతో వుండే ఆమెను బాలవితంతువని భావించడానికికూడా ఆస్కారం లేదుగదండి !

డాక్ట : అవునండి స్వామి !

దయా : ఇంతకు పదిహేనేళ్ళ పడుచు ప్రసవించడానికి ముందు బంధుజన పరోక్షంగా పల్లెల్లోతిరిగి బాధలు పడ

వలసిన కారణంకూడా పాపం! ఆమె యే ప్రేమి వంచితురాలో అయివుంటుందని నేను వూహిస్తున్నాను ఏమంటారు ?

డాక్ట : ఏమనడానికి మీరన్నట్టు యే వంచితురాలు కాక పోతే! ఆమెకు అజ్ఞాతవాసం చేయవలసిన అగత్యం యేం పట్టిందంటారు ?

దయా : ఈ వేళతో పాపం! బ్రతుకుమీద నిరాశ చేసుకుని యేటిలోదిగి ప్రాణత్యాగం చేసుకోదుగదా ?

డాక్ట : అంత ప్రాణత్యాగం చేసుకునేది కంటికి రెప్పలా కాపాడుకుంటూవున్న కన్నకూతుర్ని యెందుకు ఇచ్చట పారవేసి పోదంటారు ?

దయా : అవునండి ఆమాటకూడా నిజమే! ఆమె చర్య యే విధంగా ఆలోచించినా అయోమయంగానే వుంది.

డాక్ట : మీరన్నట్టు ప్రేమించినవారెవరో చేయవలసిన ద్రోహంచేసి పెళ్ళిచేసుకోకపోగా పాపం యీమె సంఘపు సంకెళ్లకు వెరచి అజ్ఞాతంగా యింతకాలం వెళ్ళబుచ్చి......

దయా : వెళ్లబుచ్చి యేంలాభం ? యీనగచి నక్కలపాలు చేసినట్లు యీనాటితో పాపాయితోబాటు ఇహలోక యాత్ర ముగించివుంటే ?

డాక్ట : అలాంటి సాహసకృత్యం ఆదిలోనే చేస్తుందిగాని... యింతకాలంబ్రతికి చిట్టచివరికి యిలాంటి నికృష్టపుపని చేయదనే నా నమ్మకం స్వామి!

దయా : నాకూ అదేనమ్మకమండి ! కాని లోకంలో దురాత్మాగ్రులమాయకు లోనై యిలాంటి అభాగినీ అభాగ్యుల జీవితాలు యెన్నెన్ని కుంగి కృశించి కూలిపోతున్నవో గదా ? పాపం ! (ఒక ఆశ్రమవాసి పరుగునవచ్చి దయానందస్వామికి నమస్కరించి ఒక కవరిచ్చును)

దయా : (కవరుపైన వ్రాసిన వ్రాతచూచి చదువును) "దయవుంచి దయానందస్వాములవారుతప్ప యీ కవరు విప్పి యెవరు చదువరాదు"

ఇట్లు మీావిధేయురాలు,
సత్యవతి.

డాక్ట : (సంతోషంగా) ఆ అభాగిని వ్రాసిందే అనుమానం లేదండిస్వామి !

దయా : (ఆశ్రమవాసితో) ఈకవరు నీకు యెక్కడ దొరికింది అబ్బాయి ?

ఆశ్రమవాసి : అది ఆ పద్దెనిమిదవ గదిలో దొరికిందని మన గంగులు యిచ్చాడుస్వామి !

డాక్ట : అయితే ! యింకేం ? ఆమెదేస్వామి ! యీాకవరు.

దయా : ఆమె పేరు సత్యవతి అన్నమాట !

(తెరలో గంటమ్రోంత వినబడును)

దయా : అప్పుడే ప్రార్థనాసమయం అయినట్టుంది. లేవండి ప్రార్థనానంతరం విషయం విచారించుకుందాం.

డాక్ట : చిత్తం స్వామి !

(అందరు వెళ్లుదురు)

(తెరపడును)

శ్రీః

# (చతుర్థదృశ్యం)

(ధర్మయ్యగారి ఇల్లు. సావడిలో నొక డ్రాయరు మూడు కుర్చీలు వుండును. ప్రభావతి కుర్చీలో కూర్చొని పుస్తకం చదువుతూ వుండును.)

సీ॥ వల్మీక సంభవ; వ్యాస బుద్ధాశోక
 గాంధీ ముఖుల్ నీదు కడుపు పంట
సావిత్ర్యరుంధతీ జానకీ రుక్మిణీ
 ప్రభృతి సాధ్వులు నీదు వర దుహితలు
నదనదీ కానన నగ సర్వ పస్యాఢ్య
 భూభాగములు నీదు భూషణములు
శాంత్య హింసా దయా సత్యక్షమాశౌచ
 శమదమాదులు నీదు సద్గుణములు
తాజమహల్ నీదు తలదాచుకొను కొంప
 కోహినూర్మణి నీదు కొప్పు పువ్వు

తే॥ భాసురచిరత్న రత్న సువర్ణ రజిత
ఘనఖనీకోటి నీదు దాచిన ధనమ్ము
సకలదేశ సంస్తవనీయ సచ్చరిత్ర!
భరతమాత ! నీకు సహస్ర వందనముల

ధర్మ : (ప్రవేశిస్తూ) ఎప్పుడుచూచినా యేదోగ్రంథ కాల క్షేపం చేస్తూనేవుంటావ్! యిప్పుడు నువ్వు చదివేది యేంపుస్తకమమ్మా!

ప్రభా : (లేచి) ప్రజారాజ్యం నాన్నగారు!

ధర్మ : (కుర్చీలో కూర్చొని) ఇదేనా? అమర్‌నాథ్ వ్రాసిన పుస్తకం?

ప్రభా : (కూర్చొని) అవును నాన్నగారు.

ధర్మ : గాంధేయ సిద్ధాంతాలు ప్రాతిపదికగాగల ప్రజారాజ్య రాజకీయాల్ని. దీన్లో బాగావ్రాసేడటగా?

ప్రభా : అవును నాన్నగారు.

ధర్మ : ఆగర్భశ్రీమంతుడయినా యీ కాలానికి అమూల్య గ్రంథాన్ని వ్రాశాడు.

ప్రభా : అధర్మాన్ని ధర్మంతో, అసత్యాన్ని సత్యంతో, సాధించాలనే గాంధీగారి సిద్ధాంతాల్ని కరతలామల కంగా గ్రహించగలిగినవారు గానీ యీలాంటిగ్రంథాలు వ్రాయలేరు నాన్నగారు!

ధర్మ : కాదుమరి? పాలితుడు పాలకుడు అనే సంకుచిత భావంపోయిన ప్రజారాజ్యంలో అమర్‌నాథ్‌లాంటి త్యాగమూర్తి పుట్టి అహింసాత్మక విప్లవాన్ని లేవ దీయకపోతే! ప్రజారాజ్యం యెన్నటికీ ఫలప్రదం కానేరదు, పాపాయి!

ప్రభా : అవును నాన్నగారు! అనాథుగాని ఆర్థిక స్వాతంత్ర్యం అందరికి సమానమయి, శాంతి సౌభాగ్య సౌఖ్యాలు సమకూరాలన్ కూడాను.

ధర్మ : ఆమాట నిజం. పాపం యీ అమర్‌నాథ్ తండ్రి శంకరరావుగారు యెప్పుడో తమ పాలిర్రైతులికి పండిన పంటలో సగంపాలు పంచిపెట్టేవారు పాపాయి!

ప్రభా : అలాగా నాన్నగారు! అందుకే! అమర్‌నాథ్ కూడా తండ్రిగారిబుద్ధిని పుణికిపుచ్చుకుని మరీపుట్టేరు.

ధర్మ : కాక! రత్నాలగనిలో రాళ్లు పుటతాయా?

ప్రభా : అయితే! నాన్నగారు అమర్‌నాథ్ తండ్రిగారు కలరా సోకిచనిపోయిన అయిదుగంటల్లోతల్లిగారుకూడా ...

ధర్మ : (అందుకుని) అవునమ్మా! భర్తృవియోగాన్ని భరిండలేక పాపం ఆ సాధ్వీమణికూడా స్వర్గస్థురాలయింది.

ప్రభా : ఎంతగొప్పవారి కయినా దైవనిర్ణయం మాత్రం తప్పదుగదండి! నాన్నగారు.

ధర్మ : అవునమ్మా! ఆపుణ్యదంపతులు పోయేసరికి అమర్‌నాథునికి అయిదేళ్లుకూడా వుండవేమో పాపం!

ప్రభా : కాబట్టే! శ్రీహరిరావుగారి పంటల్లో పానకవర్షం పడుతూవుంది నాన్నగారు.

ధర్మ : చెట్టుపాతేవాడు ఒకడు. ఫలమనుభవించేవాడు మరొకడూ అని సామ్యం వూరకేరాలేదుగా (ఇటునటు పరికించి) అన్నయ్య యెక్కడికి వెళ్లేడు పాపయి!

ప్రభా : ఇప్పుడే వస్తానంటూ యీపుస్తకాలు యిచ్చటపెట్టి వెళ్లాడు నాన్నగారు!

ధర్మ : (లేచి) పొలంవెళ్ళి వస్తాను. అన్నయ్యారాగానే పూల మొక్కలికి నీళ్ళుపోయమనిచెప్పు (వెళ్ళును)

ప్రభా : (లేచి) అలాగే నాన్నగారు. (కూర్చుని పుస్తకంవిప్పి చదువును)

సీ॥ కేబవల్ గష్టించి యాబాల గోపాల
మున కన్నముబెట్టు ఘనుడు రైతు
ఘాసంబువేసి గోగణమును బోషించి
పాలనొసంగెడు వాఁడు రైతు
పాదపంబుల నాటి ఫలశాకముల సదా
గ్రామంబులకుఁ బంపు రాజు రైతు
సర్వ వస్తూత్పత్తి శ్రమకోర్చి చేకూర్చి
వర్తకులను బెంచు ప్రభువు రైతు

తే॥ అట్టి లోకైక పోషకుండైన రైతు
రత్న గర్భయన్ బేరున రాణకెక్కి
నట్టి భరతావనీ పుత్రుఁడైన రైతు
ధన్యతముఁడని పలుకంగఁ దగును గాదె!

భాస్క : (ప్రవేశించి) ఆపద్యంలో రైతు ఆధిక్యతగురించి అమర్‌నాథ్ యెంత అద్భుతంగా చిత్రించేడో చూసేవా? చెల్లాయ్!

ప్రభా : (చూచి) అవునన్నాయ్!

భాస్క : (కుర్చీలో కూర్చుని) ఏదీ? చెల్లాయ్! ఆ పదివపేజీ తీసి చదువు. ప్రజాస్వామిక చైతన్యంలేని దేశంలో

శాసనాలద్వారా ప్రజాసమస్యలు సక్రమంగా పరిష్కారం కావని నిరూపించి చక్కగా వ్రాశాడు.

ప్రభా : (తీసి చదువును) జగద్గురువయిన గాంధీమహాత్ముని అహింసాపూర్వక సత్యాగ్రహ తారకమంత్రంద్వారా మనకు 1947 ఆగష్టు 15వ తేదీని ఉపనివేశ స్వారాజ్యం అవతరించి 1950 జనవరి 26వ తేదీనుంచి సంపూర్ణ స్వపరిపాలనాధికారం యేర్పడింది. కాని దొంగా, చీకటి యేకమయినట్లు అధికారగర్వోన్మత్తులయిన శాసకుల అప్రతిష్ఠకరప్రవర్తన ఫలితంగానూ, ధనమదాంధులయిన ధనికవర్గపు దోపిడీవిధానం మూలకంగానూ, "నోరున్నవారిదే రాజ్యం నొల్లునున్నవారిదే భోజ్యం" అయిపోయి ప్రజాస్వామ్యఫలితం ప్రజానీకానికి సమానంగా సమకూరక శాసనశకటం వక్రగమానానికి వుపక్రమించింది.

భాస్క : అవును చెల్లాయ్! అన్యాయపరులయిన అధికార్లు, స్వార్థపరులయిన పూంజీపతులు ప్రజాద్రోహులై, ప్రవర్తిస్తూవుంటే! శాసనశకటంసక్రమంగా ముందుకు యెలా సాగిపోగలుగుతుందీ?

ప్రభా : అంచేత ప్రజలు ప్రభుత్వోద్యోగుల్ని, లోకసభా శాసనసభా సభ్యుల్ని, మంత్రుల్ని వేయి కళ్ళతో వీక్షిస్తూ యెప్పటికప్పుడు గుణపాఠం చెబుతూవుంటే పల్లెల్లోనూ, పట్నాల్లోనూ ప్రళయతాండవంచేస్తూ

పైత్యరోగంలా ప్రబలమయిపోతూవున్న త్రాగుబోతు తనం నీటిమీది నూనెబొట్టులా నలుమూలల అలుము కుంటూవున్న బ్లాక్ మార్కెట్టుబేరం, అంటురోగంలా ఆవహించిన లంచగొండితనం, నిశ్శేషంగా నిర్మూలం కాక నిలుస్తాయా ?

భాస్క— అవును. అప్పుడుగానీ... ...

ప్రభా : ప్రజలకి ప్రభుత్వానికి కమ్యూనిటీ ప్రాజెక్టులపయిన జాతీయవిస్తరణ కార్యక్రమాలపయిన యేకైకలక్ష్యం యేర్పడి మనకు వచ్చిన స్వరాజ్యం రామరాజ్యమై రాణించదు.

భాస్క— : కాదుమరి ? ప్రజాసహాకార సారథ్యాన్ని అనుస రించేగా? ప్రభుత్వ రథం సక్రమంగానయినా వక్రంగా నయినా ప్రయాణం చేయడం ?

ప్రభా : కనుక ప్రజలే పంచాయతీ సభ్యుల్ని మొదలుకుని పార్లమెంటు సభ్యుల వరకు వారివారి నిత్యకృత్యా లలో సత్ప్రవర్తనం, స్వార్థరాహిత్యం, సహనం, సహాసం మొదలయినవాటిని చూచియెన్నుకున్న నాడు దేశీ యార్థిక సాంస్కృతిక వ్యవస్థాపునరుజ్జీవన వాంఛా యుతమైన ప్రజాభిప్రాయమే ప్రభుత్వానికి కూడా ప్రధాన లక్ష్యమయి దేశం వైజ్ఞానికంగా, పారిశ్రామి కంగా ఆర్థికంగా అభివృద్ధి పొందగలుతుంది.

భాస్క : తప్పకుండాను! అప్పుడుగానీ శక్తిపెత్తనందార్ల గద్దె పొంకాలు గంగపాలయి ప్రతి వ్యక్తికి పంచభూతాల్లో సమాన భాగస్వామ్యసమకూరదు. (జ్ఞప్తినభినయించి) నాన్నగారు అప్పుడే పొలం వెళ్లేరా? చెల్లాయ్!

ప్రభా : (పుస్తకం మూసి) అవును అన్నాయ్! నిన్ను పూల మొక్కలకు నీళ్లు పోయమన్నారు.

భాస్క : పాడి ఆవును పచ్చిక బీడులో కట్టివస్తాను. యీ లోపున అమర్‌నాథ్ వస్తే నేను వచ్చేవరకు వుండమని చెప్పు (లేచి రెండడుగులు ముందుకు నడచి చూచి) అడుగో! అమర్‌నాథ్ అన్నటయిం ప్రకారం రానే వచ్చాడు. (ఇద్దరు యెదురు వెళ్లుదురు)

అమర్ : (నవ్వుతూ ప్రవేశించి) అన్నా చెల్లెండ్రు యిద్దరు యేదో చదువుకుంటున్నట్టున్నారు?

భాస్క : అవును నీ రామరాజ్యం మా చెల్లాయి చదువుతూ వుంటే! వింటూవున్నాను.

ప్రభా : దయచేయండి! (కుర్చీ కనపరచును. ముగ్గురు కూర్చుందురు) మహాత్ములు పూరకే గారు...

భాస్క : (అందుకుని) వచ్చిన మహాత్ములికి మాటలతో నేనా? మర్యాద చేయడం చెల్లాయ్!

అమ : (చిరునవ్వుతో) ఆహ్వానించి ఆసనం యిచ్చేరుగా? తలంకంటే యింకేం చేయాలి మర్యాద?

భాస్క : అదికాదు అమర్! యింటికి వచ్చిన అతిథికి కాస్త కాఫీ యివ్వడం యీ కాలంలో ఘనమైన గౌరవం అయిుందిగా!

ప్రభా : (చిరునవ్వుతో) అయితే తీసుకువస్తాను (లేచును)

అమ : మీ నాన్నగారుతో మాట్లాడి వెళదామని యిప్పుడే కాఫీ త్రాగి బయలుదేరి వచ్చాను.

భాస్క : ఇప్పుడే! మా నాన్నగారు పొలం వెళ్లేరట. అయినా అయ్యేసరికి వస్తారు. యీ లోపున కాస్త మా కాఫీ సేవించి తాపీగా మా తోటలో షికారు చేస్తూవుండు. నాకు కాస్త పని వుంది ఇప్పుడే వస్తాను. (వెళ్ళును)

ప్రభా : (చిరునవ్వుతో) అమర్ నాథ్! కాఫీ తీసుకువస్తాను. కూర్చోండి!

అమ : వద్దు! వద్దు! యిప్పుడేగా! కాఫీ త్రాగిబయలుదేరింది.

ప్రభా : (చిరు నవ్వుతో) కాఫీ త్రాగినంతమాత్రాన కడుపు నిండుతుందంటారా?

అమ : (నవ్వుతూ) కడుపు నిండకపోతేమాత్రం దేనికయినా కాలవ్యవధి వుండాలిగా?

ప్రభా : కాఫీ యేమీ ఘనపదార్థం కాదులెండి.

అమ : సరే! కాదూకూడదు అంటే బాగుంటుందా?

ప్రభా : సంతోషం (వెళ్ళును)

అమ : ఆహా! యీ ప్రభావతి నవయౌవనాగత సౌందర్యం అపూర్వం! అనన్యస్త్రీ సామాన్యం!

సీ॥ పూర్ణేందు నిరసించుఁ బూఁబోడి నెమ్మోము
మారు తూపు జయించు మగువచూపు
తిలసుమంబు హసించు నలివేణి నాసిక
పగడంబు నోడించుఁ బడతి మోవి
వెన్నెలఁ బాలించు వెలఁదుక చిరునవ్వు
పికవాణి నణగించు వెలఁది పలుకు
పూదండలను మించుఁ బోలఁతుక కరములు
కరి కరంబులనోంచు' గలికి కాళ్లు
తే॥ పుటము వేసిన కనకంపుఁ బోలుపు మీరుఁ
దలిరుఁబోడి యొడలిడాలు ధరణియందు
నిట్టి సర్వాంగ సుందరి యెందుఁగూడ
గతము లేదిప్పుడైనను గానరాదు

ప్రభా : (కాఫీ తీసుకుని హాస్యాద్వారముగా ప్రవేశించును.)

అమ : (నవ్వుతూ) శ్రమ యెందుకంటే! ఒప్పుకున్నావు కావు ప్రభా! (కాఫీ అందుకొనును)

ప్రభా : (నవ్వుతూ) ఇంతమాత్రానికే శ్రమ అంటారా? ఈ రాత్రిభోజనంకూడా...

అమ : అబ్బబ్బ! అలాంటి యేర్పాటు యేఁమీ చేయవద్దు.

ప్రభా : (చిన్నబుచ్చుకొని) అవును లెండి! భాగ్యవంతులయిన మీకు మాబోటి పేదవారి యింట భోజనం...

అమ : ఆ! ఎంతమాట! భాగ్యవంతులయితే మాత్రం బంగారం తింటారా? ప్రభా! నీ అనుగ్రహం వుంటే! మీ ఇంట భోజనాలు చేసే రోజులు యెన్నో వున్నాయ్!

ప్రభా : (సందేహంతో) నా అనుగ్రహమా? దేనికంటారు?

అమ : (కాఫీ కప్పు క్రింద పెట్టి) చెప్పమంటావా ?

ప్రభా : (ధీమాగా) చెప్పండి! చల్లకొచ్చి ముంత దాయడం యెందుకు ?

అమ : (నవ్వుతూ) అయితే విను. మద్రాస్ నుంచి చదువు పూర్తి చేసుకుని వచ్చాక నిన్ను యెన్నో పర్యాయాలు ఒక అమూల్యమైన వస్తువును అడగాలని అడగలేక పోయాను.

ప్రభా : ఆజ్ఞా కారుల్ని అడగలేకపోవడం దేనికంటారు ?

అమ : అడిగి వీల్లేదనిపించుకోవడం...

ప్రభా : వీల్లేదని మేము యే చెఱువు నీరు త్రాగ్గలమంటారు!

అమ . అదేంమాట! ప్రాధేయపూర్వకంగా అడిగే వస్తువుని శాసించి అడిగే అధికారం నాకు యెక్కడిది ప్రభా ॥

ప్రభా : అంత అనుగ్రహం నామీద వుంటే...

అమ : (నవ్వుతూ) అడిగి లేదనిపించుకోమంటావ్ అంతేగా?

ప్రభా : కాదు నేనివ్వగలవస్తువును ప్రాణం వుండగా లేదనను.

అమ : లేదనన మాట అంటే చాలదు.

ప్రభా : చాలక చేతిలో చేయి వేసి ప్రమాణం చేయమంటారు?

అమ : అవునుమరి !

ప్రభా : (నవ్వుతూ) సరే! (అమర్ నాథ్ చేతిలో చేయి వేయును)

అమ : (సంతోషంతో ప్రభావతి చేయి పట్టుకొని) ప్రభావతి! నీ ప్రేమోపహారంకంటేనాకు కావలసింది యేంవుంది?

ప్రభా : (ఉలిక్కిపడి) అది సాధ్యమా అమర్‌నాథ్!

అమ : (నిరుత్సాహంగా) ఇంతమాత్రానికేనా! కోరుకో మన్నావ్.

ప్రభా : (చిరు నవ్వుతో) కాలవాహినీ ప్రవాహానికి యెదురీదడం...

అమ : సాధ్యం కాదంటావ్!

ప్రభా : అవుతుంది అంటారా!

అమ (నిష్ఠూరంగా) అంత ఆత్మ స్వాతంత్ర్యం లేనిదానవు నా చేతిలో యెందుకని చేయి వేశావ్! చెప్పు?

ప్రభా : (చిరునవ్వుతో) చేయి వేస్తే మాత్రం? పెద్దల చాటు వారి మాట...

అమ : చెల్లదనా? నీ సందేహం?

ప్రభా : ఎలా చెల్లుతుందంటారు?

అమ : చెల్లక? వ్యక్తి స్వాతంత్ర్యం వున్నవారి మాట యెన్నటికి వ్యర్థంకాదు.

ప్రభా : అంతరం తెలియకుండా మాట్లాడుతున్నారు.

అమ : అదిమాత్రం అర్థంలేని మాట అంటాను.

ప్రభా : మీ వేదాంతానికేం లెండి?

అమ : వేదాంతంకాదు ప్రభా యదార్థం!

ప్రభా : కాదు పాతిక యెకరాలు పంటభూమి, పాతికవేల రూపాయలు యిస్తామని ప్రతిరోజూ పదిమంది కన్యాదాతలు మాయింట పడిగాపులుపడి వుంటున్నావుడే...

అమ : (దురుసుగా) ఊఁ పడివుంటూవుంటే ?

ప్రభా : పదియెకరాలు పాలి పొలం చేసుకుని బ్రతుకుతూ వుండే మా నాన్నగారు మీకు యేం వరకట్నం ఇచ్చి నన్ను పెళ్ళి చేస్తారు ? చెప్పండి !

అమ : (నవ్వి) ఓహో ! అదా ? నీ సంశయం !

ప్రభా : సంశయమే కాదు సాగని సంకల్పం కూడాను.

అమ : స్త్రీ పురుషుల జీవితానందానికి జీవగఱ్ఱ ప్రేమగాని ధనం మాత్రం కాదు తెలుసా ?

ప్రభా : కబుర్లికి కార్యాలికి కావలసినంత తేడా వుంటుంది లెండి.

అమ : అందుకని సనాతన సంస్కృతి ననుసరించి కట్నాలిచ్చి కట్టబెడితేగాని కన్యాదానం ఫలప్రదం కాదంటావ్ !

ప్రభా : కాదనకపోతే మాత్రం ? యీ రోజుల్లో సిరిరా మోకాలడ్డే త్యాగజీవులు యెవరున్నారంటారు ?

అమ : ఉండక అందరు అత్తవారిచ్చే కట్నాలకు ఆశించి తన ఆశయాల్తో యేకీభవించని యే కన్యనయినా వివాహం ఆడతారనేనా ? నీవనేది.

ప్రభా : ఆడక పెద్దవాళ్ళమాట త్రోసిరాజని పిన్నలు యేం చేయగలరు.

అమర్ : చేయలేక, చేతులునలుపుకుంటూ శరీరంమీద ఆత్మ మీద అధికారంవున్న నేను మానసిక బానిసత్వానికి

లోనయి, పెళ్ళివిషయమయి పెడత్రోవలుపట్టిస్తూ వుండే పెద్దలపెత్తనం మాత్రం...

ప్రభా : (అందుకుని) పనికిరాదంటారు ?

అమర్ : పనికిరాదనడమే కాదు. సాగనివ్వను కూడాను. సమాజం బలవంతింగా విధించే కృత్రిమ సభ్యతను ఖాతరు చేసే దుర్బలత్వం నాకు యేనాడులేదు ప్రభా !

ప్రభా : (పరమానందంతో) నిజంగా సేనా ? అమర్ !

అమర్ : నిజం ప్రభా ! వసంతమల్లికా ప్రసవంలా ప్రణయ సౌరభాన్ని వెదజల్లుతూ, బాహ్యసౌందర్యంతో బాటు, హృదయసౌందర్యంకూడాకలిగి, నన్ను ఒక వెలుగు బాటలో నడిపించగల నిన్ను తప్ప, నాకు యీజన్మలో పెళ్ళాడేభాగ్యమేవుంటే ! మరి యెవర్నీ వివాహం చేసుకోనంటాను.

ప్రభా : (గుంభనగా) అది మీ గృహకలహానికి కారణం అయితే !

అమర్ : కలహానికేకాదు ప్రళయానికి కారణంఅయినా, నా నిర్ణయానికిమాత్రం తిరుగులేదు.

ప్రభా : తిరుగులేదని, మీరు అర్ధాంగిగానన్ను యేంచూచి అంగీకరించేది ?

అమర్ : చెప్పమంటావా ?

సీ॥ సర్వ ప్రజాహ్లాద సంధాయకంబైన
హృద్యైక గాంధర్వ విద్య నీవు

మూర్తి మంతంబౌచు మోహనాకారత
రాజిల్లు శృంగార రసము వీవు
భువనత్రయ జయేచ్ఛఁ బువ్వు ధనుర్ముక్త
రామాస్వరూప శరంబ వీవు
ప్రణయ సందేశంబుఁ బంపుటకై పెంచు
చిత్తసంభవుని చేఁజిలుక వీవు
తే॥ మేల్మిబంగారమును సుధామిళిత మొనరఁ
జేసి ప్రాణంబులం బోసి చేడిచేసి
తనదు నైపుణ్యమును లోకమునకుఁజూపు
సృష్టికర్త్రి కృతాపూర్వ సృష్టి వీవు.

ప్రభా : (చిరునవ్వుతో) ఇదంతా మీ మనోభావనగానీ! నాలో మీరన్న...

అమర్ : గుణాలు లేవంటావ్! కాని గులాబీపుష్పానికి తన గుబాళింపు యెలా తెలుస్తుంది? ఇదిగో! నువ్వు సరే! అని సమ్మతిస్తే! యిప్పుడే మన ప్రణయసామ్రాజ్యానికి పతాకంగా నాయీ అంగుళీకాన్ని నీకు అరణంగా యిస్తున్నాను. (తన వ్రేలివుంగరంతీసి ప్రభావతివ్రేలికి పెట్టును)

ప్రభా : (ఆనందంతో) ఆగర్భశ్రీమంతులు సౌందర్యతేజోమూర్తులు అయిన మీకు నాపయిని కలిగిన అవ్యాజమయిన అనుగ్రహానికి నాప్రేమజ్యోతుల్తో నివాళ్లివ్వడంతంచే! నా జన్మకు సార్థకత యేముంటుందని సమ్మతించనంటారు?

అమర్ : (సంతోషంతో) ధన్యాత్మున్ణి! అమృతకలశంలాంటి నువ్వు అర్థాంగిలక్ష్మివి అవడంతంచే! నాకుమాత్రం

కావలసిన మహాభాగ్యం యేం వుంది ? చెప్పు ప్రభా ! (చేతివాచీ చూచుకొని) అబ్బా ! అప్పుడే అయిదు కావచ్చిందే !

ప్రభా : అయిదు అయితేమాత్రం అంత తొందరపడతారు యీ మైలుదూరం వెళ్ళలేకపోతారా ?

అమర్ : వెళ్ళలేకపోతాననికాదు ప్రభా! యింటివద్ద యింకా యెన్నో పనులున్నాయి !

ప్రభా : (ధర్మయ్యగారి రానచూచి) అరుగో ! మాటలో మా నాన్నగారుకూడా రానేవచ్చారు.

ధర్మ : (ప్రవేశించి) ఎంతసేపయింది బాబు ! నువ్వు వచ్చి ?

అమర్ : నమస్కారమండీ ! ధర్మయ్యగారూ ! గంట లోపు అవుతుంది నేవచ్చి అప్పుడే !

ధర్మ : ఏదో పనిమీదగాని రావు నువ్వు...

అమర్ : పనిమీదే వచ్చానండి ! మొన్న మీతో మనవి చేసిన కార్యం గురించి...

ధర్మ : అదా ! మీ తలిదండ్రులపేర కట్టించాలన్న స్మారక భవనాల గురించేగా ?

అమర్ : అవునండి. ఆపని మీ చేదోడు వాదోడు వుంటే గాని...

ప్రభా : సాగదంటారు ?

ధర్మ : సాగేదేముందిగానీ...

అమర్ : నా పేరనున్న లక్షరూపాయలు...

ధర్మ : బ్యాంకువారు యిస్తామన్నారా ? బాబు !

అమర్ : ఇవ్వడానికి వారి అభ్యంతరంమాత్రం లేదన్నారు.

ధర్మ : (సందేహంతో) కాని.. యీ భవనాల నిర్మాణం మీ మామగారికి సమ్మతమేనా ?

భాస్క : (హుటాహుటీగా ప్రవేశించి) వడ్డీకి వడ్డీలు కట్టించి తానిచ్చిన సొమ్ముకి రెట్టింపు గుంజుకోనడంతప్ప, పెద్ద పులి పేరంటం పెట్టనిస్తుందా అని వీరి మామగారు సత్కార్యాలు చేయడానికి సమ్మతిస్తారా? నాన్నగారు!

ప్రభా : సమ్మతించకపోవడానికి, బ్యాంకులో తెచ్చి వీరుఖర్చు పెట్టేడబ్బు వారి కష్టార్జితంకాదు గదండి నాన్నగారు !

ధర్మ : కాకపోతే మాత్రం ? పిల్లికి బిచ్చంపెట్టని పిసినారికి యింతసొమ్ము ఖర్చుపెట్టడానికి యెలా ఒప్పుదల అవుతుంది ?

అమర్ : ఒప్పుదల కాదనేగదండి ! ఆర్థికవిషయం వారికి తెలియనీయకుండా యీ భవనాలు కట్టించడం ?

ప్రభా : చిత్రగుప్తుడులాంటి గణపతి తన చెంతనున్నంతకాలం శ్రీహరి రావుగారికి యీ రహస్యం తెలియనివ్వకపోవడం సర్వేశ్వరునికికూడా సాధ్యం కాదేమో !

అమర్ : సాధ్యం అవడానికి, నా యువజనసంఘంవారు చందాలు వసూలుచేసి కట్టిస్తున్నట్టేగాని ప్రత్యేకించి నా పేరు యేమీ వుండదుగా ?

ధర్మ : అలాగ అయితేనే తప్పక నువ్వుతలపెట్టిన యీ మహా కార్యం సాంతంగా సఫలంకాదుబాబు!

ప్రభా : అధర్మంకాని కార్యానికి అనేకమయిన అవాంతరాలు వస్తూవుంటాయి...

భాస్క : వచ్చినా ? సూటిగా భూమిపయి ప్రసరించే సూర్య కిరణాల ధాటికి మంచుబిందువుల్లా అవి అన్నీ మటు మాయమయి పోతాయి.

ప్రభా: పోక ? పర్వతాన్ని తాకిన యేనుగు కోరలు భగ్నం అయిపోతాయిగానీ ! పర్వతానికి ప్రమాదంరాదుగా?

అమర్ : రెణ్ణెళ్ల పాటు మీ భాస్కరాన్నిపుసి మాకు సహ కారంగా పంపించేరంటే ! ...

ధర్మ : అంతకంటేనా ! మానవసేవే మాధవసేవగా యెంచి పదిమందికి వుపకరించేపన్లు చేసే నీకు మేము ఆమాత్రం తోడ్పాటు చేయలేమా ? తప్పక తీసుకుని వెళ్ళు బాబు!

అమర్ :·అదే పదివేలు. రేపట్నుంచి పంపించండి.

ధర్మ : రేపు వర్జంలేకుండా చూచి వస్తాడులే !

అమర్ : నమస్కారం. నాకు యింక శెలవిస్తారా? (లేచును)

ధర్మ : శుభం. వెళ్ళిరా నాయనా !

అమర్ : (ప్రభావతిని ఓరగంట చూచి వెళ్ళును)

ధర్మ : వయస్సుచేత చిన్నవాడయినా అప్పుడే ఉత్కృష్ట మయినకార్యాలుచేయడానికి వువ్విళ్ళూరుతూవున్నాడు.

ప్రభా : దాత చేతిలో ధనంవుంటే ! దానధర్మాలు చేయ డానికేగాని పాపపుపన్లు చేయడానికి పంచిపెట్టరుగా ?

భాస్క : చెడ్డవాని జేబులో డబ్బువుంటే ! చెడుపన్లు చేయ డానికేగాని సత్కార్యాలు చేయడానికిమాత్రం సంక ల్పిస్తాడా ? చెల్లాయి !

ధర్మ : అందుకే చేప పిల్లకి ఈత, సింహం పిల్లకి వేట చెప్ప వలసిన పనిలేదన్నారు శాస్త్రకారులు.

(అందరు వెళ్ళుదురు)

(తెరపడును)

శ్రీః

# (పంచమదృశ్యం)

(గణపతియిల్లు చావడిలోని కుర్చీమీద కూర్చొని భాస్కరారావు పుస్తకం చదువుతూ వుండును)

సీ॥ స్వాచరణోచితా చార్యుండ వైనచో
నన్యోపదేశార్హుఁడగుదు వీవు
నిర్జితషడ్వర్గ; నీచారివైనచో
నరిమద్దయుండ వే; యగుదువీవు
స్వసనైకతృప్త సుస్వాంతుడవైనచో
నష్టసంపద్భుక్తుఁడగుదువీవు
పక్షపాతరహిత భావుండవైనచో
నఖిలన్పమిత్రుఁడ వగుదువీవు

తే॥ వేదశాస్త్రార్థభావైక వేదివైన
శత్రు దుర్జయ సామర్థ్య శాలివైన
భవ్య సర్వం సహాచక్రవర్తివైన
నాక్య చతురుండవైన లాభంబు లేదు.

గిరీ : (ప్రవేశిస్తూ) అరే! వీడి తస్సాదియ్యా! "తాడుతో నే తొట్రిల్లెదరు" అని హాయిద్దుల శకునాలు వీడు దాపరించేడేఁవిటి? (సమీపించి) భాస్కర్రావా? ఎప్పుడొచ్చావ్ బాబు?

భాస్క : (లేచి, మీరా? దయచేసేరూ? (వికటస్వరంతో)

శా॥ ఏయే గ్రామములేగి నారచట యేయే కార్యముల్ జేసిరో!
ఆయా గ్రామము లాపనుల్ దెలపఁగా నర్థించెదన్ భక్తిమై....

గిరీ : (ఉడుకుబోతు తనంతో) ఆపు! ఆపు! కవిత్వం మొన్నాళ్ళుంచి కాలబెడుతున్నా వేఁవిటి బాబు!

భాస్క : మీ వంటి రాజకీయ మహాపండితుల్ని చూసేసరికి యెవరికయినా కవిత్వం కదంత్రొక్కుకుంటూ గంగా ప్రవాహంలా రావల్సిందే! పద్యంపూర్తిగా చెప్పనిచ్చారు కాదు. బ్రహ్మాండంగా పడ్డాయిసుమాండి! పదాలు.

గిరీ : (ఎత్తిపొడుపుగా) నీ సంగీతం బ్రహ్మాండంగా లేదూ?

భాస్క : నా సంగీతానికేంగాని, గణపతిగారు! పల్లెన్నీ స్వకంగా, సాంతంగా, చక్కబెట్టుకునే వచ్చారా?

గిరీ : కంచిగరుడసేవతప్ప పైసా కలిసివచ్చే పనులికి కామగా మేం పడేపాట్లు? భాస్కర్రావ్!

భాస్క : (వెగటుగానవ్వి) కలిసివచ్చే పనులికి కాకపోతే గడపదాటి కాలావలికి పెడతారా? బాబు? మీరు?

గణ : నీ శుష్క ప్రియాలికి, శూన్యహస్తాలకీ ఏంగాని! ఎప్పుడు వచ్చావో చెప్పేవు కావు!

భాస్క : చెప్పడానికి యేంవుందండీ! మీ కనకారావు కబురు చేస్తే? నిన్నే వచ్చాను.

గణ : (సందేహంతో) నిన్నే వచ్చావూ?

భాస్క : వచ్చి వూరకే కూర్చొని వున్నాననుకున్నారా?

గణ : కూర్చొనివుండక నువ్వు వుద్ధరించిన ఘనకార్యం యేం విటో కాస్త చెప్పు? నాయనా!

భాస్క : చెప్పమంటారా? దేవాలయ ధర్మకర్తలయిన మీ శ్రీహరిరావుగారు గుడిగుమాస్తాగిరి చేస్తూవుండే మీరు కలిసి పదేళ్ళనుంచి గ్రామచరిత్రలో కలకాలం పేరుండేలా చేస్తూవుండే ఘనకార్యాల్ని కళ్ళారా చూస్తూ...

గణ : కాలక్షేపం చేసేవన్నమాట.

భాస్క : లేదు. హృదయాలు లేకుండా మీరుచేసిన దారుణ కార్యాల్ని చూచి మీయిద్దరి వుద్యోగాలు వూడబెరికే సుముహూర్త మెప్పుడువస్తుందా అని వూహిస్తూ గడిపేను కాలం.

గణ : (బూకాయింపుతో) మేమేంచేయరాని చెడుపన్లుచేసే మని? నువ్వు మమ్మల్ని చెండనాడ్డం?

భాస్క : మీరుచేసిన మహాకార్యాలు కలంతీసుకుని వ్రాయ గల కవీశ్వరులుంటే! సవా లక్ష పేజీల గ్రంథ మవుతుంది. గణపతిగారు.

గణ : అదేదో నువ్వు కాస్త యిప్పుడు చెప్పకూడదూ ?

భాస్క : ఎందుకు చెప్పకూడదండి! సావకాశంగా కూర్చుంటే సంక్షిప్తంగా దాని సారాంశం చక్కగా చెబుతాను.

గణ : (కూర్చొని) సరే. చెప్పుబాబు ! మేంచేసిన చెడుపను లేఁవిటో మరి ?

భాస్క : (కూర్చొసి) ఏఁవిటంటారా ? లెక్కపెట్టండి. ప్రతి రోజూ పలువురు ఫలమో పత్రమో పట్టుకునివచ్చి భక్తిశ్రద్ధల్తో ప్రార్థనచేసుకునే పరమేశ్వరుని ప్రార్థనా మందిరాన్ని ధూపదీప నైవేద్యాలు లేకుండా చేయించి దయ్యాలకొంపలా తయ్యారుచేసేరా లేదా? మీరు?

గణ : (తాము కానట్టు) మేమూ చేసింది ? అడిగేవాడికి చెప్పేవాడు లోకువని అన్యాయంగా అనడంగానీ !

భాస్క : (ధీమాగా) చెప్పేవున్నీ శాంతంగా సాంతంగా విని సరిగా సరసంగా సమాధానం చెప్పండి !

గణ : (సమాధానపడి) సరే! నీకట్టుకథ యేఁవిటో కానియ్

భాస్క : ఏఁవిటా? వినండి. శ్రవణానందంగా ప్రతి పర్వపు రోజుల్లోనూ యేపుణ్యకథాశ్రవణమో, చేయిస్తూ వుండే కళామందిరాన్ని చూడడానికూడ అసహ్యంగా

వుండే జూదపుశాలగా చేసింది మీరుకాదా? ప్రమాణం చేసి చెప్పండి.

గణ : (సణుక్కుంటూ) మతిచెడినమాట ఆడుతున్నావ్ !

భాస్క : (సాక్షేపణగా) కాదు లెండి యింకా వినండి. పుణ్యక్షేత్రమని పొరుగూళ్ళనుంచి వచ్చేయాత్రికుల సౌకర్యార్థం, యేపుణ్యాత్ముడో కట్టించియిచ్చిన ధర్మశాలను దొంగకల్లు అమ్మేదుకాణంగా చేసింది యెవరంటారు ?

గణ : ఎవరో మాకేం తెలుసు. అన్యాయంగా మామీద అభాండాలుమోపి పాపాన్ని ఒడిగట్టుకుంటున్నావ్ !

భాస్క : మీ శాపాలకేంగానీ! కూలిపోవడానికి సిద్ధంగా వున్న గోపురాన్ని గోరెతునున్నంఅయినా పూయించకుండా గబ్బిలాయిల్ని కాపురం పెట్టించి గొబ్బికంపు బూటకం అంటారా ?

గణ : (కోపంతో) బూటకంకాదు నీ నాటకం

భాస్క : ఆగండి ! అగ్గిలో గుగ్గిలంలా అలా మండిపడతారెందుకు గణపతిగారు ! తీర్థపురోజుల్లో స్నానపానాదులుచేసే కోనేటిని మురికిగుడ్డలు వుతికించి దున్నపోతుల్ని తోలించి కాళ్ళు కడగడానికికూడా పనికిరాని కుళ్ళుగుంటగా చేయించారు ఒప్పుకుంటారా!

గణ : ఒప్పుకోవడానికి నీవూళ్ళదంపుడు వాదాని కేంగానీ, వూళ్లో వాళ్ళందరికి లేని సాదకబాదకాలు మాకెందుకు వాలా ?

భాస్క : కావాలని కాకపోతే! గ్రామస్థుల్ని అదుపులో పెట్ట లేని మీబోటి అవకాశవాదులికి అధికారాలెందుకు? యింకా వినండి! గూళ్ళచుట్టూ కోటగోడల్లా కొండ నంటుకుంటూవుండే పరిహారీ పడిపోతూవుంటే జారి పోయే యిటుకల్ని అర్ధరాత్రివేళ మీయిళ్ళకు జారే యించుకుని, దూడల సాలలకి గోడలు కట్టించుకోవ డంమాత్రం మీకు కావల్సింది కాబోల్నే?

గణ : అదేంమాట, అర్థంలేనిమాట. రాతిగోడలు కట్టించ బోతున్నాంగనుక ఆ యిటుకల్నిలా వుపయోగించు కున్నాం యేం?

భాస్క : ఏవుంది? యిటుకల్నలా మీరు మీ స్వంతకార్యా లకి వుపయోగించుకోవడం యిదేంబుద్ధితక్కువనియీ గ్రామంలో యెవరూ అడిగేవారు లేకేగా? మీరిలా హద్దుమీరి ప్రవర్తించడం?

గణ : హద్దుమీరని బుద్ధిమంతులు గ్రామంలో అడగడానికి మీరు బయలు దేరేరుగా!

భాస్క : బయలుదేరక? యేతాంపాటకు యెదురుపాటలేదని విఱ్ఱవీగుదూవుండే మీ పప్పులు యింక వుడకనిస్తాం అనుకున్నారా?

గణ : (స్తబ్ధస్వరంతో) సరే! అయిందా? నీవుపన్యాసం?

భాస్క : అవుతుందా? యిలా మీరుచేసిన అన్యాయాల్ని వ్రేళ్ళుమడిచి చెప్పాలంటే యెన్నయినా వున్నాయి!

గణ : వుంటే వూరుకున్నా వేం ?

భాస్క : వూరుకోలేదు. అసలువిషయం చెబుతా వినండి. పూర్వం ఘోరీ గజనీలనేవారు సోమనాథాలయం మొదలయినవానిని చూర్ణంచేసి దండోపాయంతో వాట్లోని అమూల్య రత్నాభరణాల్ని అపహరించి పట్టుకుపోయారు. మీరుమాత్రం పాపం వారిలా కాక.

గణ : కాక యేం చేశాం ?

భాస్క : ఏంచేశారా ? సామోపాయంగా యేటా యేభై యెకరాల్లో పండే పంటల్ని మీపగం చేసుకుంటూ దినదినమూ దేవుడికివచ్చే ముడుపుల్ని మీ సొంత సొమ్ములాగా మూడకట్టుకుంటూ, ఆదాయంలో అర వైశాతంయీ యిదివరకే అయినా ఖర్చుపెట్టే పాపానికి పాల్ప డ్డంలేదు. యింకా యేం చేయాలి ?

గణ : (కోపంతో) ఎవడయ్యా ! నీకీ పుక్కిటపురాణ చెప్పిన పోకిరీ వెధవ !

భాస్క : చెప్పకపోతేమాత్రం ? ప్రత్యక్షంగా కనబడే మీ చేతలికి సాక్ష్యాలు ! కావాలంటారా ?

గణ : కావాలనకపోతే ! "దున్నపోతు యీనిందంటే దూడ్ణి కట్టెయ్యమ"న్నట్టు లేనిపోని అపవాదుల్ని మామెత్తిన్ని రుద్దుతావా ?

భాస్క : రుద్దక, యీమధ్య మీరు మా యువజనసంఘం వారిని విమర్శిస్తూ వూళ్లో వుపన్యాసాలు యిస్తున్నా

రట. మేము మీలా యేం అమానుష కార్యాలు చేస్తున్నామని ? గణపతిగారు !

గణ : చిన్నా పెద్దా తారతమ్యం తెలుసుకోకుండా గ్రామంలో మామీద గాలిదుమారం లేవదీయడం మీకు . .

అమర్ : (ప్రవేశిస్తూ) భావ్యంకాదంటారు!

గణ : (చూచి) అంబంలో కుంబంలా నువ్వుకూడా వచ్చావ్వూ?

అమర్ : రావడానికేంగానీ ! పెద్దలంటే మీ పరిభాష శ్రీమంతులనేగా ?

గణ : శ్రీమంతుల్ని చెండనాడ్డం చెడ్డకాదంటావా ?

భాస్క : చెల్లుబడి అవుతూవుందని; శ్రీమంతుడు చెడుగా ప్రవర్తిస్తూవున్నా అదేంవిటనడం అన్యాయమంటారు ?

గణ : (విసుగుదలగా) కయ్యానికి కాలుద్రువ్వడానికి కాకపోతే

అమర్ : కయ్యానికి కాలుద్రువ్వేది మీరా ? మేమా ?

గణ : కనబడుతూ వుందిగా ?

అమర్ : ఎందుకు కనపడదు ? పాత పంచాయతీ ప్రెశిడెంటు గారు యీతో "ఈ పర్యాయానికి పంచాయతీబోర్డు పరిపాలనం యువజనసంఘవారికి యిద్దాం" అంటే మీరు మీ శ్రీహరిరావుగారు వీల్లేదన్నారటగా ?

గణ : ఎందుకు అన్నాం అంటావ్ !

భాస్క : ఎందుకా ? దేవాలయ ధర్మకర్తలయి వ్వారికి యీ పదేళ్ళలో చేసిన వుపకారానికి వడ్డీగా పదిమందికి

పనికివస్తూవున్న బావుల్ని, చెరువుల్ని పాడుచేయించి ప్రజలికి పరమోపకారం చేయాలని భావించారు గనుక.

గణ : కాకపోతే! శాసనవిధానం సరిగా తెలియని మీయువ జన సంఘంవారు వుద్యోగస్థులయి వూరునుద్ధరిస్తారు కాబోలు ?

అమర్ : అదా! సమాచారం? శాసనవిధానం చక్కగా తెలుసుకున్న మీరు యిరువుగు యే యాభై వేలో ఖర్చుపెట్టి, యే శాసనసభాసభ్యులో, లోకసభాసభ్యు లో, మంత్రులో అయ్యి, కాటన్ దొరగారు కష్టపడి కట్టించిన ఆనకట్టల్ని వడగొట్టించి దేశానికి యీ తిండీ గుడ్డా లేకుండాచేసి, మీ కడుపుమంట చల్లార్చు కోరాదూ ?

గణ ; నీ మొత్తిపాడుపు మాటలకేంగానీ! మా శ్రీహరి రావుగారు చేసిన దేశసేవ చిన్నవాడవు నీకేం తెలుసు?

భాస్క ; అవును. మీ శ్రీహరిరావుగారు పదేళ్ళకిత్రితం జస్టీసు పార్టీనాయకులుగా వుండి, యింగ్లీషువాళ్ళ మోచేతినీళ్ళు త్రాగుతూ కాంగ్రేసునాయకులంటే! కారాలు మిరి యాలునూరి కాలం గ్రరునతిరిగి కాంగ్రేసునాయకులు గద్దెనెక్కడంతో కలిసివచ్చేటట్టు కనబడి...

గణ : కనబడి యేంచేశారు ?

అమర్ : వూసరవిల్లి రంగులు మార్చుకున్నట్టు మిల్లుబట్టలు పెట్టిలో పెట్టి ఖద్దరుబట్టలు కట్టుకున్నారు.

గణ : ఊఁ కట్టుకుంటే! నష్టం యేం వచ్చిందీ!

భాస్క : ఏం వచ్చిందంటారా? "కట్టేవి ఖద్దరుబట్టలు కొట్టేవి బీదల పొట్టలూ" అని కరువు కాటకాల్లో కల్లోలంగా వుండే యీ కాలంలో పాలకుల బాసటతో ప్రతితిను బండారానికి పరిమిట్లు సంపాదించుకుని, అర్థరూపాయి వస్తువుని అయిదురూపాయలకి అమ్ముకున్నారు కావం టారా? గుండెమీద చేయి వేసుకుని చెప్పండి!

గణ : ఏఁవని చెప్పేది? అందరికి అందుబాటులో లేని ఆహార పదార్థాల్ని ఆ గడ్డురోజుల్లో నానాగడ్డికరచి సంపాదించి యేదోధరజేసి యివ్వడం కేవలం మా స్వార్థానికే అంటావు?

అమర్ : మీస్వార్థానికి కాదు. అన్నమో రామచంద్రా! అంటూ పాపం ఆకలిబాధల్తో అలమటిస్తూవున్న అనాథులవద్ద అణా నూకలికి అర్థరూపాయి తీసుకోవడం కూడా పరమార్థానికే అనుకుంటాను?

గణ : కాక? ప్రజల ప్రాణాల్ని కాపాడ్డం అన్యాయంఅంటావా?

అమర్ : కాకపోతే? ఎవరికంపు వారికింపని అమాయకుల్ని అదిరించి బెదిరించి ఆర్జించి మీబొజ్జల్ని పెంచుకోవడం న్యాయం కాబోల్ను?

గణ : (నిర్లక్ష్యంగా) న్యాయమో! గీయమో! ఆరోజుల్లో అం దరికి ఆహార పదార్థాల్ని అందజేసినందుకు అభినందిం చాలి.

భాస్క : అంగజేసేరు గనుకనే, యెనిమిదియెకరాలుగల శ్రీహరిరావుగారు యాభైయెకరాలూ, పూటకి తిండానా లేని మీరు యీనాటికి పుట్టెడుభూమిని చేబట్టగలిగేరు. అబద్ధమంటారా ?

గణ : సంపాదించుకున్న వారిని చూచి సహించలేకపోవడం మన భారతీయులికి ప్రథమంనుంచీవున్న పరిపాటేగా ?

అమర్ : (ఆవేశంగా) పరిపాటికాదు. మీబోటి నాయకం మన్యుల్ని తలయెత్తుకుని తిరగనీయడం నిజంగా భారతీయుల గ్రహపాటు.

భాస్క : గ్రహపాటు కాకపోతే ! బీదసాదల్ని కాల్చుకు తింటూ కబంధుల్లా గ్రామగౌరవాన్ని యెందుకు గంగ పాలు చేస్తారు.

అమర్ : కడుపులుకొట్టి గడించుకున్నధనం హారంతికర్పూరంలా హరించిపోతుందని పాపం మీకు తెలియదుగదండి !

గణ : తెలియకపోవడానికి మేము యెవరికళ్ళకి గంతలుకట్టి యేంమోసం చేశేమంటావ్ !

భాస్క : మోసంకాకపోతే ! ఆదర్శమూర్తిఅయిన యీ అమర్‌నాథుని ఐశ్వర్యాన్ని హస్తగతంచేసుకోవాలని మీరుపన్నే పన్నాగం ప్రజలకెవరికీ తెలియదనా ?

గణ : తెలియవచ్చు కాని...అది (శ్రీ)హరిరావుగారి యింటి విషయం.

అమర్ : అంటే ! గోవుల్నికోసి చెప్పులు దానం చేస్తాం అంటారు. అదేగా మీమాటలలో సారాంశం ?

గణ : అంటే ?

భాస్క : అంటే! మీ శ్రీహరిరావుగారు మేనల్లునిఆస్తిదిగ మ్రింగి పంచాయతీబోర్డు ప్రెశిడెంటులయి, ఫ్రూళ్లో వాళ్లిన్ని వుద్ధరిస్తారంటారు.

గణ : వుద్ధరించడానికి కంకణంకట్టుకుని మీ యువజనసంఘం వారు సిద్ధపడుతున్నారుగా ?

అమర్ : సిద్ధపడక! మీరువేసే ప్రచ్ఛన్న వేషాల్ని పోగడుతూ, భట్రాజుల్లా బలపరుస్తాం అనుకుంటున్నారా?

గణ : బలపర్చమని మిమ్మల్నెవరం బతిమాలేం చేయాంటే బాబు ? ఇంట్లోవాళ్ళు యిలోఅంటే బయటవాళ్ళు పాలో అంటారని భాధ్యతల నున్నో మా బ్రతుకుల్ని బయటపెడుతూవుంటే ! వీధిలోవారిమాట వేరే చెప్పాలా ?

భాస్క : అలారండి దార్లోకి. అంతేగాని ... కపటనాటకం ఆడుతూ ప్రజల కళ్ళకియీరోజుల్లో మీరెంతటి ఘనులయినా ? గంతలు కట్టలేరు గణపతిగారు !

గణ : సరేగానీ! చూసేవా? మాయింట్లో వాళ్ళ వరుస?

భాస్క : (ముభావంగా) మీ యింట్లోవాళ్ళు యేంచేశారు?

గణ : (దురుసుగా) ఏంచేశారా? యింతసేపట్నుంచి మనం క్రిందా మీదా పడుతూవుంటే!ఒక్కరయినా బయటికి వచ్చి నా మంచీ చెడ్డా చూచినవారు వున్నారా ?

అమ : చూడడానికి యింకా యెవరూ రాలేదుగదండీ!

గణ : (సందేహంతో) రాలేదుగదండి? రాకపోవడం యేంవిటి?

భాస్క : ఊళ్లో లేరుగనుక !

గణ : ఊళ్లో లేకకట్టగట్టుకుని కాశీయాత్రకు వెళ్ళేరా ?

అమ : వెళ్లింది యాత్రకుకాదు పెళ్ళికి !

గణ : (ఉలిక్కిపడి) పెళ్ళికి ? యెవరింట్లో పెళ్ళికి?

భాస్క : ఎవరింట్లో పెళ్ళికో అయితే! యింట్లోని వాళ్ళంతా యెందుకు వెళతారు?

అమ : పెళ్ళి చేయడానికిగాని, యిల్లు కట్టడానికిగాని పెట్టి పుట్టాలి. లేకపోతే ! "పెళ్ళి చేసిచూడు యిల్లు కట్టి చూడు" అని యెందుకంటారు పెద్దలు?

గణ : (సందేహంతో) కొంపముంచి నాకొడుకు మీరు కలిసి యేదో కుతంత్రం చేసేరేమిటి?

భాస్క : కుతంత్రమో ! స్వతంత్రమో ! చెబుతాంగానీ ! ముందు నామాటకిసూటిగా సమాధానంచెబుతారా?

గణ : (విసుగ్గా) చెప్పేదేమిటి ? నీ చెప్పదంటు ప్రశ్నకి సమాధానం

అమ : ఏంవిటంటారా ? మీ పాపాయి జన్మదినోత్సవంనాడు "మా అమ్మాయిని మీ అబ్బాయికి పెళ్ళి చేసుకోవాలి" అని మీరు మీచెల్లెలుగారి చేతిలో చేయి వేయించుకున్నారట...

గణ : (అందుకుని) వేయించుకుంటే! యిప్పుడా గంపశ్రాద్ధం అంతా బయటపెట్టడం ఎందుకూ అని.

భాస్క : యెందుకంటారా ? ఆనాటికి పచ్చగావున్న మీ చెల్లెలుగారి పరిస్థితిబట్టి శపథం చేయించుకొని ఈ నాటి వారిలేమిని చూసి ప్లేటు ఫిరాయించారు గనుక.

గణ : ఫిరాయించక పోతే? పట్టుమని పదిబస్తాలు రానివానికి పిల్లనిచ్చి వివాహం చేయడం వినోదానికా ?

భాస్క : వినోదానికికాకపోతే ! వృద్ధుడయివున్న శ్రీహరి రావుగారికి వివాహం చేయుడానికి సిద్ధపడడం మీ ప్రమోదానికా ?

గణ : ప్రమోదానికి కాకపోతే ! కలిగినవాణ్ణి పెళ్లాడి మా పాపాయి కష్టపడుతుందంటావు ?

భాస్క : (చులకనగా) కష్టపడితేమాత్రమేం లెండి. మీ కు కలసివస్తున్నప్పుడు.

అమ : కలసివస్తుందన్న కాంక్షతో మీరు పిల్లనిస్తామన్నా అరవైయేళ్ళుదాటి షష్ఠిపూర్తి చేసుకున్న శ్రీహరి రావుగారు పెళ్ళి చేసుకుంటాననడంలో అర్థం లేదు.

గణ : ఎందుకని లేదు ?

అమ : (వ్యంగ్యంగా) వుంది వుంది. లేకపోలేదు అది యేమి టంటారా ! మీ శ్రీహరిరావుగారు తన మొదటి పెళ్లికి ధర్మాన్ని, రెండవపెళ్లికి అర్థాన్ని, మూడవ పెళ్లికి కామాన్ని, యీ నాలుగవ పెళ్లికి విన్నారూ? మోక్షాన్ని యిలా వరుసగా ధర్మార్థకామమోక్షాల్ని సాధించుకోవడానికి సంకల్పించుకున్నారు అంతే! గదండి

గణ : (కోపంతో) చాల్లే ! చదువుకున్నవాడవు చక్కని అర్థం చెప్పావ్ !

భాస్క : ఉన్న మాట అంటే మీకు అంతకోపం యెందుకు?

గణ : కోపంకాకపోతే యేఁవిటి ? శుభమా అంటూ మా పాపాయిని ఒక కోటీశ్వరునికిచ్చి పెళ్లి చేయాలను కుంటూ వుంటే ! అశుభ వాక్యాలంటూ వేఁమిటి ? అన్యాయంగా ?

అమ : (చులకనగా) అన్యాయం కాకపోతే ? గంగిగోవుని కసాయివానికి అర్పిస్తున్నట్టు మెరుపు దీగెలాంటి మీ పాపాయిని ముఁదుసలికిచ్చి తూ తూ మంత్రంపెళ్లి చేస్తాననడం మీదిమహాన్యాయం కాబోల్ను ?

గణ : (మొండితనంగా) అది నాఇష్టం ! మా పా పా యి కష్టసుఖాలు నాకు తెలుసులే !

భాస్క : తెలియకేం ? ఆ వృద్ధఘటం హరే ! అని ఆవలికి పోవడంతో వారి ఐశ్వర్యాన్ని హస్తగతం చేసుకుని కన్న కూతుర్ని అలో లక్ష్మణా అంటూ అఘోరిస్తూ బ్రతికినంత కాలం ఏపంచనో పడివుండమని కోటీశ్వరులయి కునకాలను కోవడం మీకు బాగా తెలుసు.

గణ : హద్దుమీరి మాటాడుతున్నావ్ !

భాస్క : అలా అయితే! ఇంట్లోనూ వీదిలోనూ ఆడిందాట పాడింది పాటగా మీ పెత్తనం యింతకాలం యెందుకు సాగుతుంది ?

గణ : సాగకపోతే సాగకపోతుంది. యింతకు మీ అరవ కజ్జం దేనికి ? చెప్పండి !

అమర్ : మేం చెప్పేదేముందండి ! అయిందేదో అయిపో యింది...

గణ : (విసుగుదలతో) ఏఁవిటా అయింది.

భాస్క : మీ పాపాయి పెళ్ళి.

గణ : (దురుసుగా) నా బొందిలో ప్రాణంవుండగా కాదు.

అమ : అయితే ప్రస్తుతం పెళ్ళివాహాంక చేస్తారా ?

గణ : (ఆదుర్దాగా) ఏఁవిటి నీ మాటలు.

భాస్క : ఏఁ వుంది ? రాత్రి మూడున్నరగంటలకి హస్తానక్షత్రయుక్త మిథునలగ్నానికి మీ మేనల్లునికి మీ అమ్మాయినిచ్చి మీ కనకారావు కాళ్ళుకడిగి కన్యాదానం చేసాడు తెలిసిందా ?

గణ : (గుండెలు బాదుకొని) ఆ ! నిజమేనా ? కొంపదీసి !

అమర్ : నిజంకాక ? అబద్ధ ఆడవలసిన అగత్యం యేం వచ్చింది మాకు !

గణ : (నిట్టూర్పువిడిచి) మా కనకారావు మీ మాయా జాలంలోపడి, నా భగీరథప్రయత్నాన్ని భగ్నంచేస్తా డని కలలో అయినా అనుకోలేను. పదిహేనేళ్ళ క్రితంనాటిన నా ఆశావృక్షాన్ని మీరు ముగ్గురుకలిసి నేటితో మొదలంట కూల్చివేశారు. యీ వార్తను మా శ్రీహరిరావుగారికి యేముఖం పెట్టుకుని వెళ్ళి విన్నవించుకోవాలి ? చివరకు నా పూహాగానం అంతా బూడిదలోపోసిన పన్నీరులా వ్యర్థమైపోయిందిగదా !

భాస్క : వ్యర్థంగాక స్వార్థంతో కన్నకూతుర్నే తడిపాతతో గొంతుకోయాలని తలచిన మీ చెడుతలంపు సార్థకం యెలా అవుతుంది ?

అమర్ : "కుక్క కాటుకి చెప్పుదెబ్బలా మీ కనకారావు చక్కని పని చేశాడు" (వీధిలో బండిచప్పుడు వినబడును)

భాస్క : (విని) అదుగో ! మీ కనకారావు పెళ్ళిచేసి మీ అల్లుణ్ణి కూతుర్ని ఆనందంగా మీ బండిమీద అప్పుడే తీసుకుని వచ్చేశాడు. చూడండి.

గణ : (కోపంతో) సరే ! రానీ ! చూస్తాను.

భాస్క : ఏం చేయటానికి మీరు చూసేది? అనవసరంగా ఆగ్రహావేశంతో పచ్చిమిరపకాయతిన్న పండుకోతిలా మిడిసిపడక నవవధూవరుల్ని ఆశీర్వదించి మీ మర్యాద మీరు కాపాడుకోండి.

అమర్ : మర్యాద కావాలన్న మనుష్యులు యిలాంటి మర్కటపు పనెందుకుచేస్తారు.

(భాస్కరావు, అమర్‌నాథులు విరగబడి నవ్వుదురు. గణపతి సిగ్గుపడును)

(తెరపడును)

శ్రీః

# (షష్ఠదృశ్యం)

(ధర్మయ్యగారి గృహోద్యానం అమర్‌నాథ్ ఫోటో చేతబట్టుకుని ప్రభావతి ఆనందంగా పాడుతూ ఆడుతూ ప్రవేశించును.)

పాట - కాఫీ - ఆది.

ప్రేమోద్యాన విహారీ!
సుమశర కోమల దేహధారీ! ||ప్రేమో||

1. చరణసేవా భాగ్యము నాకు
సమకూరేదది యెపుడో! ||ప్రేమో||

2. పూలవనములో పున్నమరేయి
విహరించేదది యెపుడో! ||ప్రేమో||

3. ప్రణయోపవన కురంగంబులమై
కలిసి తిరుగునది యెపుడో! ||ప్రేమో||

ప్రభా: (పాట ముగించి) ఆహా! నా భావిభాగ్యోదయానికి ప్రథమ వసంతోత్సవంగా నన్ను మానసిక వివాహం చేసుకున్న యీ భామినీపర్యాయ మన్మథుని మధుర స్మృతి. నా మనోవీణను మీటుతూ నన్నెంత ఆనంద పరవశురాలిని చేస్తూవుంది.

సీ|| సంపదకనువైన సద్వ్యవహారంబు
వ్యవహారమున కనువైన విద్య
విద్యకు ననువైన వినయస్వభావంబు
భావాని కనువైన భవ్యబుద్ధి
బుద్ధికినను వైన బోధన జ్ఞానంబు
జ్ఞానానికనువైన కార్య దీక్ష
దీక్షకు ననువైన దాక్షిణ్య హృదయంబు
హృదయానికనువైన యిద్ధ శక్తి

తే|| శక్తికనువైన సత్కార్య సాధనంబు
సాధనంబున కనువైన సఫలతయును
గలిగి త్రైలోక్య మోహనాకార గరిమ
పరలుచున్నాడు నామనోహరుడు భళిర!

అమర్ : (వెనుకబాటున వచ్చి) ఎవరబ్బా! ఆ మోహనాకారుడు ?

ప్రభా : (ఫోటో దాచి సిగ్గుతో) మీరా ?

అమ : అవును నేనే. ఏది ? ఆఫోటో !

ప్రభా : (నవ్వుతూ) ఊహుం ! నేనివ్వను.

అమ : ఇవ్వాలి (వెన్నాడును)

ప్రభా : ఇవ్వనంటూవుంటే ! ఏఁవిటి మీ చిలిపితనం ?

అమ : ఇవ్వాలంటే ! యేఁవిటి నీ పెంకితనం ? (బలవంతముగా లాగికొని చూచి) ఓహో ! యిది నా చిత్రపటమే ! అయితే యింకేం ? చిత్రకళలోకూడా నువ్వు అందెవేసిన చేయివన్నమాట.

ప్రభా : (నవ్వుతూ) హృదయఫలక చిత్రితులయి వున్నవారి చిత్రాన్ని వ్రాయడంలో చిత్రం యేఁవుందండీ !

అమ : (ఠీవిగా) అప్పుడే నువ్వు ప్రణయ దేవతారాధనకూడా ప్రారంభించేవన్నమాట !

ప్రభా : (చమత్కారంగా) ఓ ! హృదయ దేవాతా వశీకరణానికి ప్రణయమంత్రం కంటే ప్రధానమయిన సాధనం లేదుగండి !

అమ : (ముఖభావంగా) అందుకు ఆత్మజనుల అంగీకారంకూడా అవసరంయేమో ! ఆలోచించావా ? ప్రభా !

ప్రభా : (సందేహంతో) అది మీకా ? నాకా ?

అమ : ఎవరికయినాగానీ !

ప్రభా : ప్రణయజీవుల పవిత్ర ప్రేమకు ప్రపంచం ప్రతిఘటించినా ప్రతిబంధకాలు రావు. వచ్చినా పలాయన మంత్రం పఠిస్తూ పరాభవం పొందకాపోవు.

అమ : (ప్రభావతి చేయి పట్టుకొని) ప్రభావతి! పరిశోధనాతీతమయిన నీ ప్రేమపాశం యెంత బలీయమైంది? శరీరాన్నుంచి ఆత్మను వేరుజేయగలనుగాని నా తరుణహృదయాన్ని గిలిగింతలు పెడుతూవున్న నీ ఆనంద స్వరూపాన్ని మాత్రం నా మనోవేధినుంచి వేరు చేయలేను.

ప్రభా : సృష్టికి పెట్టని కోటలాంటి మీ జగన్మోహనమూర్తిని కలలోనయినా నా మానసాకాశాన్నుంచి మాత్రం వేరుచేయగలనంటారా ?

అమ : చిరునవ్వుముత్యాలు చిలకరించు నువ్వు నాజీవిత నౌకాయానానికి ధృతతారవై, జీవిత భాగస్వామినివి కావడం నా పూర్వజన్మ సుకృతం ప్రభా!

ప్రభా : చరిత్రాత్మక కర్తవ్య నిర్వాహణకయి జన్మించిన మీ పాదపూజకు నా యౌవనవనంలో పూసిన ప్రణయ ప్రసూనాల్ని వుపయోగించి మీ ప్రేమవాహినీ తరంగాల్లో వూగడం నాజన్మకు ధన్యతగాదంటారా ?

అమ : (ప్రభావతితో కలిసి ముందుకు నడిచి) చూడు ప్రభా! కనులు పండువుగా కలకల్లాడుతూవున్న మీ పూదోట నందనవనంలా; వసంతుని కళావైభవాన్ని వేనోళ్ళ

చాటుతూ, యెంత మనోహరంగావుందో !

ప్రభా : అందుకనేగదండి ! సహజ సౌందర్యానికి కృత్రిమ సౌందర్యం యెన్నటికి సాటి కాకపోవడం ?

అమ : ఎలా అవుతుందిమరి ?

ప్రభా : (వ్రేలితో చూపుతూ) చూడండి.

తే|| స్వనిలయాగతాతిథులని స్వాగతంబు
నొసఁగవనలక్ష్మి, మలయవాయువును గంధ
మనెడు నర్ఘ్యంబుతోఁబంచె, నాదరమున
స్వాగతము స్వీకరింపుడు, స్వాంతమలర.

అమ : (సుఖస్పర్శనభినయించి) అవునుప్రభా ! మీాప్రియదా వన లక్ష్మిగౌరవం అపూర్వంగావుంది.

పాట—భీంపలాస్ (అభేరి) ఆది.

అమర్ : వనవిహారమును జేయుదమా ?
ప్రణయామృతమును గ్రోలుదమా ?
వ్యాహాతీత ప్రణయలోకమున
ప్రయాణమును సాగించెదమా ? ||వన||

ప్రభా : తీగెటుయ్యెలల నూగుదమా ?
తీయనిపాటలు పాడుదమా ?
రాగాలాపనజేయుచు కౌతుక
సాగరంబులో మునుగుదమా ? ||వన||

అమర్ : కసులపండుపుగ గంతులువేయుచు
మనోహరములగు మాటలనాడుచు
అనురాగామృత స్రవంతిలోపల
అవగాహనమును జేయుదమా ? ||వన||

ప్రభా : చిలిపిపనులతో చిరునగవులతో
వలపు తేనియలు వలక బోయుచు
పలువిధములుగా ఆటలనాడుచు
బ్రహ్మానందము నందుదమా ? ||వన||

ప్రభా : (సగర్వంగా) అమర్ ! ఈపూలమొక్కల్ని నీరుపోసి నేనే స్వయంగా పెంచాను.

అమ : పెంచావనేకాబోల్సు ప్రభా ! ఘుమఘుమా పరిమళించు పూలతో, నేత్రోత్సవం చేకూర్చు యీ మొక్కలన్నీ నీరాకచూచి కృతజ్ఞతాసూచకంగా నిన్ను పలుకరించాలన్నట్లు తమతలకాలల్ని యెలా యెత్తేయో చూడు !

ప్రభా : (చూచి) అవునవును. ప్రత్యుపకారబుద్ధితో చెట్లకు ఫలపుష్పాలు యివ్వడం పరిపాటేగదండి.

అమర్ : ప్రభా ! యిటుచూడు. యీమల్లికాలత యౌవనాంగణంలో అడుగుపెట్టిన యువతీమణిలా తనచెంతనున్న పారిజాతపతిని అలుముకుని తనలా నువ్వుకూడా భర్తతో కలిసి వచ్చావని నిన్ను యెంత ఆప్యాయంగా చూస్తూవుందో !

ప్రభా : (నవ్వుతూ) మన్మథాగమనంతో ప్రాణులికికూడా...

అమర్ : ప్రణయానురాగం ప్రాదుర్భవించి మనుష్యుల్ని అనుకరిస్తున్నాయి అంటావ్ !

ప్రభా : అవునండి ?

అమర్ : (రెండడుగులువేసి) ప్రభా ! అటుచూడు కోకిల

ఆలేమావిమ్రానుకొమ్మపయి కూర్చుని లోకాల్ని మయిమరపిస్తూ యెంతతియ్యగా పాడుతూవుందో !

ప్రభా : అవునండి ! మావిచివుళ్ళి మస్తుగా మెక్కి ఆ కోకిల తనమంజుల కూకూస్వనంతో సర్వప్రాణుల్ని...

అమర్ : ప్రాణుల్నే కాదు. స్థాణువుల్ని కూడా కదలిస్తూ వుంది. (కొంచెందూరం నడచి) ఇటుచూడు ! ఆ గువ్వలజంట తమ ముక్కూ ముక్కూ కలిపి మూగ భాషతో గుసగుస లాడుతూ, పరస్పర ప్రేమానురక్తితో, ఆపూదీవెఉయ్యాల పయికూర్చుని, యెంత వయ్యారంగా వూగుతూవుందో !

ప్రభా : (ఉల్లాసంతో) అవునండి పరస్పరానురాగమే, పతిపత్నుల యిహపరసుఖానుభూతికి పట్టుకొమ్మ.

అమర్ : అందుకే ప్రియాప్రియులు ఐహికప్రేమవాహినీ ప్రవాహాన్ని ఆధారంచేసుకుని, ఆముష్మికానంద పారావారపుటొడ్డును చేరగలుగుతారన్నారు.

ప్రభా : అలాకాకపోతే ఆశ్రమచతుష్టయంలో గృహస్థాశ్రమానికి గౌరవంయెంటుకుంటుందండి !

అమర్ : (వాచీచూచుకొని) అబ్బా ! అప్పుడే అయిదు కావచ్చిందే ?

ప్రభా : అప్పుడే !

అమర్ : అవును. (వేలితో కనపరుస్తూ)

ఉ॥ అల్లదె; కాంచుమా! తరువులందు ఖగావళి గూండ్లలోనికిన్
మెల్లగఁజొచ్చుచుండె నట మేతకుఁబోయిన గోగణంబులున్
సల్లలితంబుగాఁదిరిగి స్వామిగృహంబులఁజేరుచుండె, నో
పల్లవపాణిరో! తమరువత్సములంబరికించు వేడ్కతో.

ప్రభా : (చూచి) అవును. సూర్యాస్తమయం అయ్యేసరికియే పాలిక గూటి కాప్రాణి వెళ్ళిపోవల్సిందేగదండీ!

అమర్ : ప్రభా! నీతో కలిసి యీవనవిహారానంద మహా సాగరంలో యీదులాడుతూ యిక్కడేఉండిపోయాను.

ప్రభా : (నిష్ఠూరంగా) ఎప్పుడు మాయింటికివచ్చినా చెప్పాల్లో కాళ్ళు పెట్టుకునే వుంటారు.

అమర్ : ఏంచేయమంటావ్! కావలసినంత కార్యభారం నెత్తి పయినుండగా, ఒకచోట కూర్చొని వుండడంయెలా వీలవుతుందిచెప్పు?

ప్రభా : మానాన్నగారితో మాట్లాడాలని కబురుచేసేరుగా? మఱచిపోయారా?

అమర్ : మరచిపోలేదు. సమయానికి మీనాన్నగారు యింటి వద్దలేకపోయారుగా?

ప్రభా : మీజాబుచూచి యిప్పుడే వస్తానని చెప్పి పొలంవెళ్లారు. యీపాటికి బయలుదేరి వస్తూనేవుంటారు.

అమర్ : (జ్ఞప్తినభినయించి) అన్నట్టు అసలువిషయం మరచి పోయాను.

ప్రభా : (ఆసక్తిగా) ఏఁవిటండి ఆ అసలువిషయం?

అమర్ : ఏఁవీలేదు. ఒకపాటపాడితే విని...

ప్రభా : (చిరునవ్వుతో) ఏంబహుమతి యిస్తారు శ్రీవారు ?

అమర్ : కోరిందే యిస్తాను.

ప్రభా : సరే! (పాడును)

పాట — మాండు — ఆది.

సావిరహేతవదీనా కృష్ణా ! ||సా||
మాధవ ! మనసిజవిశిఖభయాదివ భావనయాత్వయిలీనా ||సా||

1. అతిరళనిపతితమదనశరాదివ భవభయబంధవినాశం
స్వహృదయమర్మణివర్మకరోతిస జలనళినీదళజాలం ||సా||

2. కుసుమవిశిఖశర తల్పమనల్పవిలాసకళాకమనీయం
వ్రతమివతవపరిరంభసుఖాయకరోతికుసుమశయనీయం ||సా||

అమర్ : (మహానందంతో, ఆహా! వసంతకోయిలలా ప్రేమ రసాన్ని రేకెత్తించు నీ ప్రణయగాన మాధుర్యంతో నన్ను మయిమరపించావ్ ప్రభా !

చ|| నిజతనుకాంతిచే రతినివీ వెజయింతువు; గానవిద్యలో
నజానిపతిన్ హసింతు; వఖిలాగమతత్త్వసుబోధనంబునన్
ద్విజవరుఁడౌ నగస్త్యుని సతీమణి హేళనఁజేతు; వింక వా
రిజదళనేత్ర లెవ్వరు ? ధరిత్రిసమానలు నీకు నెచ్చెలీ !

ప్రభా : (సిగ్గుపడి) ఆమహాసాధ్వీమణుల్ని అల్పజ్ఞురాలనగు నేనా అధిక్షేపించేదాన్ని ?

అమ : ఆమాటకు సందేహమా? ప్రభా! లలితకళావిలాశినివగు నీబహుముఖ ప్రజ్ఞావిశేషం సామాన్య మయిందికాదు:

ప్రభా : అభిమానంతో ఆడేమాటగాని మీరనుకున్నంతగొప్ప దాన్నిమాత్రంకాను.దానికేంగానండి మీరుకూడా ఒక పాట...

అమ : తప్పక పాడతాను. (పాడును)

పాట — హంసానందినీ — (హిండోల్) ఖండగతి.

1. వదసియదికించిదపి దంతరుచి కౌముదీ
హరతి దరతిమిర మతిఘోరం
స్ఫురదధరశీధవే తవవదన చంద్రమా
రోచయతు లోచన చకోరం॥
ప్రియే! చారుశీలే! ప్రియే! చారుశీలే!

2. త్వమపి మమభూషణం త్వమపిమమజీవనం
త్వమపి మమభవజలధిరత్నం
భవతు భవతీహమయి సతతమనురోధినీ
తత్రమ మహృదయమతియత్నం ॥ప్రియే॥

ప్రభా : (సంతోషంతో) పుంభావ సరస్వతులుకాకపోతే! బంగారానికి పరిమళం అబ్బినట్టు మీకు సాహిత్యంతో పాటు సంగీతంకూడా యెలాఅలవడుతుంది?

అమ : (ధర్మయ్యగారి రాకచూచి) అరుగో! మీనాన్నగారు వస్తున్నారు.

ప్రభా : అయితే! మా నాన్నగారితో మాట్లాడి యీ సాయంత్రం మాయింట్లో భోజనం చేసి వెళ్ళాలి.

ధర్మ : (ప్రవేశించి) అవును బాబు! యీవేళ మాపాపాయి ప్రాధేయపూర్వకంగా అడిగినందుకయినా నువ్వు అవశ్యం మా యింట్లో భోజనం చేయకతప్పదు.

అమ : క్షమించండి! మరోసారి తప్పక చేస్తాను. యింటికి వెళ్ళాలి ధర్మయ్యగారు!

ప్రభా : అదేం వీలులేదండి!

ధర్మ: అంత యింటికి వెళ్ళాలంటే భోజనంచేసి వెళ్ళవచ్చునులే! చిట్టీ! శీఘ్రంగావంట చెయ్యించి పిలు, వస్తాం

ప్రభా : సరే! నాన్నగారు! (వెళ్ళును)

అమ : నా భోజనం గురించి యింట్లోవాళ్ళి యిబ్బంది పెట్ట డానికిగాని...

ధర్మ : ఇబ్బంది యేముంది బాబు! మాతో బాటు నాల్గు మెతుకులేగా నీకు పెట్టేది.

అమ : నామీద మీకు ఆదినుంచీ ఆదరాభిమానాలు వున్నవే గాని కొ్రత్తవి కాదుగదండి.

ధర్మ : పేదలంటే ప్రేమతో కాపాడుతూవుండే నిన్ను మేమే కాదు, గ్రామంలో గౌరవించనివారు యెవరు బాబు!

అమ : అది అంతా మీబోటి పెద్దల ఆశీర్వాదఫలితం అనక తప్పదు ధర్మయ్యగారు!

ధర్మ : అయితే బాబు! మీ భవనాల నిర్మాణం నిర్విఘ్నంగా నిన్నటితో నెరవేరిందటకా ?

అమర్ : అవునండి. వెల్లతో సహితం నిన్నటికి సమాప్తం అనిపించుకోగలిగేమండి.

ధర్మ : ఈ యేకాదశికి గృహప్రవేశాలు కూడా...

అమ : జరిపించాలనే వుందండి! కానీ...

ధర్మ : ముహూర్తం కుదరలేదా బాబు !

అమ : కుదరక కాదండి ।

ధర్మ : మరి ?

అమ : ఏం వుందడి ! ఆ భవనాలకు యివ్వదలచిన భూమి రిజిష్టరి చేయించిగాని...

ధర్మ : ప్రవేశించకూడదనా ?

అమ : అవునండీ ! ఆపనికూడా యీ వారంలో ...

ధర్మ : ఎలా పూర్తి అవుతుంది ! నీ భూములేవో నీ స్వాధీనంలో లేనప్పుడు ?

అమ : ఆ పనికూడా నేడో రేపో ! ...

ధర్మ : అంత సులువుగా అవుతుందనా బాబు ! నీ విశ్వాసం.

అమ : కాక ! నా ఆస్తిమీదకూడా నాకు హక్కు లేక పోతుందంటారా ?

ధర్మ : లేకపోతుందని కాదు బాబు ! నువ్వు తొందరపడితే మీ మామగారితో నీకు అభిప్రాయభేదాలు యేర్పడి అంతర్యుద్ధానికి దారితీస్తాయని నా భయం.

అమ : అందుకని నా అస్తిత్వాన్ని కోల్పోయి ధమ్మలులేనీ దద్దమ్మలా వారాడించినట్టు ఆడమంటారు ?

ధర్మ : ఆడమనికాదు బాబు ! సరిఅయిన బాటను పోయి కార్యాన్ని సాధించుకోవడం మన కర్తవ్యం అంటాను.

అమ : ఆమాటకు నేను ఒప్పుకుంటాను కాని... పారమార్థిక దృష్టిలేని భౌతికవాది న్యాయానికి కట్టుబడతాడనే నమ్మకం మాత్రం యేంవుందండి ?

ధర్మ : నమ్మకం లేకపోయినా ఆదాయ వ్యయాల జమా ఖర్చుల్లో అన్యాయం చేయగలుగుతాడుగానీ నీఅరవై

ఎకరాలభూమి నీది కాదనలేరుగా ?

అమ : కాదనక పోవడానికి గుడిని మ్రింగేవారికి లింగం అడ్డం వస్తుందంటారా ?

శర్మ : అయితే! అంతదారుణకృత్యానికి తలపడి దస్తావేజులు వ్రాయగలుగుతారుగానీ, తాలూకాఆఫీసులోసిరికార్డు తగలబెట్టలేరుగా ?

అమ : ఏమయినా నాభూముల్ని నాస్వాధీనంలో పెట్టుకుని, యీ ఏటినుంచి మా మామగారు తొలగించిన మా పూర్వపు రైతులికే మానాన్నగారిచ్చినట్లు సగం పాలకే మా భూములన్నీ యివ్వడానికి కూడా నిర్ణయించుకున్నాను.

భాస్క : (ప్రవేశించి) "ఆలీ లేదు చూలీ లేదు కొడుకు పేరు సోమలింగం" అన్నట్లు తలా చినరాలేని నీ వ్యవహారం అటో యిటో తేలకుండా నీ సంకల్పం యెలా సాగుతుంది ? అమర్.

అమ : సామోపాయంతో నా వ్యవహారం సాగకపోతే...

శర్మ : దండోపాయానికి తలపడతావా ?

అమ : తలపడకపోతే ! యీ తరుణంలో తరుణోపాయం లేదు. రెక్కాడితేగాని, డొక్కాడని యీనాటి బీద రైతుల్ని బ్రహ్మరాక్షసుల్లా పీల్చి పిప్పిచేస్తూ నేటి సమాజయుగంలో కూడా భాగ్యవంతులన్న వారికి శాంతిభద్రతల్తో బ్రతకడం సాధ్యపడదు ధర్మయ్యగారు !

ధర్మ : సాధ్యపడదని కలహానికి కాలుద్రువ్వితే కలిసివచ్చేది ఏమీవుండదు బాబు !

భాస్క : ఉండదని "వేసిన బెడ్డకల్లా వూరుకుంటే నెత్తాడే గెలిచా" డని జడిశేకొద్దీ యింకా జడిపిస్తారు.

అమర్ : ఆమాటసత్యమే ధర్మయ్యగారు ! మరోమాట.

ధర్మ : ఏమిటిబాబు ! అది.

అమర్ : మరేమీ కాదు. గణపతి మొన్న ప్లీడరుగారియింటి వద్ద వుత్తరకుమార ప్రజ్ఞలేవో కొడుతూ గంద్రగోళం చేసేడట. నిజమేనండి ?

ధర్మ : అది చివరకు నీ చెవిలోకూడ పడిందన్నమాట !

భాస్క : పడకపోవడానికి పిల్లి కళ్ళుమూసుకుని పాలుత్రాగుతూ తన నెవరూ చూడరనుకుంటే సాగకపోతారా!

అమర్ : ప్లీడరుగారుకూడా వారికి పేచీకి దిగమనే సలహా యిచ్చారా ? ధర్మయ్యగారు.

భాస్క : (ఈసడింపుతో) పేచీకి దిగమనకపోతే కూటసాక్ష్యాలుచెప్పించి "కాకుల్ని గొట్టి గ్రద్దలకి వేసినట్టు" లేని వారి పొట్టలుకొట్టి వున్నవారి పొట్టలునింపే యీ ప్లీడర్లకి ఫీజులిచ్చే పెద్దమనుష్యులెవరుంటారు ?

ఉమ : అందుకేగా నేటి న్యాయవాదవృత్తిలో న్యాయం నేతి నేతిబీరకాయలో నేయిలా, నల్లజీలకర్రలో కర్రలా కటికి వాని హృదయంలో కరుణలా, కలికానికయినా కనబడదనడం ?

భాస్క : కనబడితే ! యీ రోజుల్లో కడుపులోచల్ల కదల కుండా ధనంసంపాదించడానికి పేచీల్ని పెంచే ప్లీడరో, ఖాదీగుడ్డలు కట్టే లీడరో, సినీమాకు సూటయ్యే యాక్టరో సూదులెక్కించే డాక్టరో, అయివుండాలని యెందుకంటారు !

అమర్ : (నవ్వి) అవునవును. లేకపోతే యీవిజ్ఞానయుగంలో న్యాయవాదుల నక్కజిత్తుల మూలకంగా మానవులు తమ నైతికశక్తుల్ని నాశనంచేసుకుని, వానరులుగా యెందుకు మారిపోతారు ?

ధర్మ : ఆమర్మం తెలుసుకున్న మనంకూడా "కళ్ళకు గ్రుచ్చు కుంటుందన్న పుల్లను కనిపెట్టి తప్పించు" కోవాలిగా ?

అమ : దానికి తటస్థవిధానమే ప్రస్తుతం తరుణోపాయమనా మీారనేది ? ధర్మయ్యగారు.

ధర్మ : అవును. తప్పించుకుని వెక్కిరించడం మంచిది.

అమ : అందుకు నన్ను యేం చేయమంటారు ?

ధర్మ : చేసేదేమీాలేదు. యీ వేళో రేపో వీలుచూడుకొని, మీా మామగారితో మాట్లాడి నాకేవిషయం చెప్పేవరకు నువ్వు యెవరితోనూ మాటపట్టింపుకూడా పెట్టుకోవద్దు.

భాస్క : పెట్టుకోవద్దని; కొంపలంటుకున్నాక కోనేరుత్రవ్వి ప్రయోజనం యేంవుందంటారు ? నాన్నగారు.

ధర్మ : లేదని, లేనిపోని పేచీల్ని పెట్టుకుని గాలికిపోయేముళ్ళ కంపను కాళ్ళకు తగిలించుకుంటారా ?

భాస్క : చిన్నపామునయినా పెద్దకఱ్ఱతో కొట్టాలని చెప్పిన పెద్దలమాట వట్టిదంటారా ?

ధర్మ : వట్టిదో ! గట్టిదో ! పరుగెత్తి పాలుత్రాగేకంటే నెమ్మది గాపోయి నీళ్ళుత్రాగడంమంచిది. లేకపోతే తీవ్రంగా పరు గెత్తే యువకుల మనోభావాలు తీరని నష్టకష్టాలకు దారితీస్తాయి.

అమ : సరే ! మీమాట కాదనడంయెందుకు ? మీ రాయ బారంతో మామామగారు దారికి రాకపోతే...

ధర్మ : తన్నులగొడ్డుకి ఆోలడ్డం పెట్టడం తప్పదుగా ?

భాస్క ; లేకపోతే! మీ మామగారితో వ్యవహారం మంత్రా లకి చింతకాయలు రాల్తాయనా ?

ధర్మ : అదేంమాట? అణ్వాస్త్రానికి సాధ్యంకాని కార్యం మహా త్ముని అహింసాయుధానికి సాధ్యంకాలేదంటావా ?

ప్రభా : (ప్రవేశించి) భోజనానికి లేస్తారా ? నాన్నగారు !

ధర్మ : సరే ! వడ్డించు వస్తున్నాం లేబాబు! తక్కినవిషయాలు తరువాత మాట్లాడుకుందాం.

(అందరు నిష్క్రమింతురు)

(తెరపడును)

శ్రీః

# (సప్తమదృశ్యం)

(శ్రీహరిరావుగారి మేడ సావడిలో డ్రాయరు కొన్ని కుర్చీలు వుండును. శ్రీహరిరావుగారు గణపతితో మాట్లాడుతూవుండును.)

శ్రీహ : దానిక్కాదు నేననేది. యింతవరకు మనం యేం చెప్పినా? యేంచేసినా? వినడం, చేయడం తప్పమనల్ని వేలు పెట్టికనపరచినవాడు గ్రామంలో యెవడయినా వున్నాడా అని.

గణ : అవునండి! పదేళ్ళనుంచిలేని పరివర్తనం మన గ్రామస్థుల్లో యీనాడు యేర్పడిందంటే! యీ యువజనసంఘంమూలకంగా కాకపోతే యింకేంవని చెప్పుకోవాలి మనం?

శ్రీహ : రాత్రికూడా వీళ్ళ రహస్యసమావేశం జరిగిందటగా?

గణ : రహస్యం యేంవుంది? ఎదురొమ్ముమీద కుంపటిలామా వీధిలోనేగా? ఆసమావేశంజరిగింది.

శ్రీహ : సరి! సరి! దానికి సభాధ్యక్షు డెవడేంవిటి?

గణ : ఎవరో అయితే! విచారించవలసిందేముందండి!

శ్రీహ : మన అమర్‌నాథేనా? యీసమావేశాన్ని సాగించింది కూడా?

గణ : మరి యింకెవరు?సమస్త కార్యభారం తన నెత్తిని పెట్టుకుని మరీ సాగించాడు.

శ్రీహ : కడుపు కోసుకుంటే కాళ్ళమీద పడుతుందని యెంత ఓర్పు వహించినా వీని ఆకతాయితనం ఆనాటికానాడు అధికమయి పోతూవుంది.

గణ : అధికరంగాక విషజ్వరం విషమాత్రతో గాని పంచదార తినిపిస్తే బాగుపడుతుందా? మీ పిచ్చిగానీ !

శ్రీహ : అవును. నా శాంతోపదేశం వాని చెవులకు అపశ్రుతిలో పడ్డ రాగాలాపంలా అసహ్యంగా నేతోచింది. లేకపోతే యీ యెన్నికల్లో మనకు యెదురు చుక్కయెందుకవుతాడు.

గణ : "పదవీ వ్యామోహపరులు పదవుల్లో వున్నంతకాలం ప్రజలపాట్లు భవంతుడుకూడా తీర్చలేడు" అంటూ మీ మేనల్లుడు గంభీరోపన్యాసం యిస్తూవుంటే! తలగిఱ్ఱున తిరిగిపోయిందనుకోండి.

శ్రీహ : (తల పంకించి)"పెంచిన కుక్కే కాలు కరచింద" నే సామ్యంగా పీడి వివేకం యీవిధంగా పరిణమించిందన్నమాట !

గణ : అందుకే కీలెరిగి వాత పెట్టకపోతే! తెలివిగలవారయినా తెల్ల మొగం వేయకతప్పదు.

శ్రీహ : తప్పదని మీనమేషాలు లెక్కిస్తూ కాళ్ళుచాచుకుని కర్రాగా కూర్చుందామా ?

గణ :కూర్చొని గంతలా యీసారికూడా మనం అర్థబలం మీద ఆధారపడి లాభంలేదు. రావుగారు !

శ్రీహ : లాభంలేక మనవూళ్లో మనకి మాటల్లో ఓట్లిచ్చేమతి మాల్నివారెవరు ? గణపతి !

గణ : ఈసారికూడా డబ్బుతీసుకున్నవాళ్ళంతా ఓట్లిస్తారనేగా రావుగారు మీవూహ.

శ్రీహ : దగా చేస్తారంటావు ?

గణ : ఢంకా బజాయించిమరీ దగా చేస్తారు. ప్రత్యామ్నాయపు పార్టీమీదవున్న మోజు యీ రోజున మనమీద గ్రామస్థులికి మచ్చుకయినా లేదు.

శ్రీహ : (నిస్పృహతో) లేనప్పుడు మనం యీ పట్టుకి యెన్నికల్నుంచి విరమించడమే మంచిదేమో !

గణ : కాదు. పదిమందిలో తలయెత్తుకుని నీవా నేనా అంటూ తిరగాలంటే ! ప్రస్తుత పరిస్థితుల్ని బట్టియిప్పుడుమీకు తప్పక పదవి కావాలి.

శ్రీభ : కావాలంటే ! ఉపాయం ?

గణ : లేకేముండి ! ఒకప్పారికి వేయిదారులు. నామాటవిని మీ మేనల్లుణ్ణి యీ యెన్నికలయ్యేవరకు నయానో, భయానో మనల్ని బలపరిచేవాణ్ణిగా...

శ్రీహ : చేసుకుంటేగాని మనపాచికలు...

గణ : పారకపోవడం ఒక్కటేకాదు. పక్కబలం చూచుకుని యువజనసంఘంవాళ్ళు మనల్ని పరాభవంకూడా చేస్తారు.

శ్రీహ : "ఆలస్యం అమృతం విషం" అని అయితే! యిప్పుడే ఆవిషయం తేల్చుకుందాం.

గణ : తేల్చుకోకుండా కార్యరంగంలో కాలుపెట్టేమా ? "గుడ్డికంటికి మందు వేస్తే వున్నకన్నుకూడా వూడింద"నే సామ్యంగా పదిహేనేళ్ళనుంచి నిరాటంకంగా నిర్వహిస్తూవున్న మనదేవాలయ ధర్మకర్తృత్వానికి సహితం, తిలోదకాలు యిచ్చుకోక తప్పదు.

శ్రీహ : ఆమాట నిజమే! అమర్‌నాథ్ గదిలో వున్నట్టు న్నాడు నేరమ్మన్నాడనని పిల్చుకునిరా!

గణ : సరేనండి. (వెళ్ళును.)

శ్రీహ : (తనలో) "ఆరు మాసాలు స్నేహం చేస్తే వారే వీరవుతా" రను సామ్యంగా బడుద్ధాయిగా తిరుగుతూ వున్న భాస్కరార్రావు స్నేహంచేసి బంగారంలాంటి పిడు పనికిరాలినవాడయి పోయాడు. గణపతి చెప్పినట్టు ముందు వీడి ముందర కాళ్ళకు బంధం వేయకపోతే యింక వీధిలో తలయెత్తుకుని తిరగడం నాతరంకాదు.

గణ : (ప్రవేశించి) మొక్కగా వున్నప్పుడు వంగని చెట్టు మ్రానయ్యేక వంగుతుందా? రావుగారు!

శ్రీహ : రానన్నాడా? గణపతి!

గణ : (ఈసడింపుతో) రానంటే యింకేమండి! రెండు కత్తులు ఒక వరలో యిమడవని విభిన్నదృక్పథాలతో వుండే వ్యక్తుల మధ్య వ్యవహారాలు విలక్షణంగా వుంటాయ్, కరవమంటే కప్పకికోపం, విడవమంటే పాముకికోపం!

శ్రీహ : యింతకు యేమంటున్నాడంటావ్?

గణ : ఏమంటేమాత్రం మీరు యిప్పుడేంచేయగలరు?

శ్రీహ : (కోపంతో) చేయలేక వానిముందుచేతులు నలుపు తాననుకున్నావా? యింత బ్రతుకూ బ్రతికి!

గణ : ఎంత బ్రతుకూబ్రతికి మీరు యెంతవిలువ సంపాదిస్తే మాత్రం యేం లాభం? అమర్‌నాథ్ దృష్టికి ఆవగింజ లా కనిపిస్తున్నారు.

శ్రీహ : (తల నాడించి) కనబడతాను, యెందుకు కనబడను చూస్తావుగా ? ఈసారి నా తడాఖా !

గణ : బ్యాంకులోంచి లక్షరూపాయలు తెచ్చి భవనాలు కట్టిస్తే మీరేంచేయగలిగేరు ? దాయమని ఇచ్చిన పదివేల రూపాయలు దానధర్మాలుచేసేస్తే మీరేం అనగలగేరు ? అనేగా వానిగుండె ధైర్యం.

శ్రీహ : (ఆవేశంగా) ధైర్యంకాదు. తలబిరుసుదనం. తల్లి దండ్రులు లేనివాడుగదా ! అని దయతలచి పెంచుతుంటున్నందుకు అచ్చుబోసిన ఆబోతులా వీని ఆకతాయితనం హద్దు మీరిపోతూవుంది.

గణ : కాబట్టి గతసేతు బంధనంవల్ల కలిసివచ్చే దేమీలేదు. యిప్పట్నుంచి అయినా జాగరూకులమయి వుండక పోయామా ! ప్రక్కలోబల్లెంలా మనకు ప్రాణకంటకం కానమానడు మీమేనల్లుడు. రావుగారూ ?

శ్రీహ : (ఉద్రేకంతో) అదీ చూస్తాగా ! నానాగడ్డి కరచి ఆర్జించి అవాలముద్దగా చేసిన ఆస్తిని తనపరం చేస్తానను కున్నాడేమో. గిల్లుకున్నా వానిచేతికి చిల్లు కాని చిక్కనివ్వను.

గణ : చిక్కనివ్వనని చెబుతూ వున్నంత మాత్రాన చేతులు కట్టుకుని మీమాటకు కట్టుబడ తాడనే మీ చాదస్తం!

శ్రీహ : కట్టుబడక ! కాదంటే వాని కథ కనుక్కుంటాగా ? సరే ఆసంగతి అలావుంచు. నువ్వు ధర్మయ్యగారి యింటికి వెళ్ళినపని యేంచేసుకుని వచ్చావ్ ?

గణ : ఏం చేయమంటారు ? యెక్కేగుమ్మంయెక్కి దిగే గుమ్మందిగి యీ వ్యవహారంలో యెన్ని బాధలు పడుతూవున్నానంటారు ?

శ్రీహ : ఎన్ని బాధలుపడి యేంలాభం ? ఇదుగో ! అదుగో ! అంటూనే యేళ్ళాటికని పెళ్ళిపోయేకకూడ యేడేళ్లు గడిపేశావ్ !

గణ : కావన్నానా ? కాలం కలిసి రానప్పుడు యేంచేస్తాం చెప్పండి.

శ్రీహ : అదికాదు యీ నెల దాటితే యీ యేటికి ముహూర్తాలు లేవనికూడా నీవే అన్నావ్ గా?

గణ : లేనిమాట నిజమేనంటండి మరి ? మనలో మనమాట అరవయి యేళ్ళు దాటినవారికి అంత సులువుగా పిల్ల నివ్వడానికి అందరు అంగీకరిస్తారా చెప్పండి ?

శ్రీహ : అందుకనేగా ? ధర్మయ్యగారు ఊఁ అంటే వారుమనకు యివ్వవలసిన యిరవయివేల రూపాయల నోటుబాపతు డబ్బు జమకట్టివేస్తాం అని చెప్పమన్నాను.

గణ : నోటుబాపతేకాదు రొఖ్ఖంకూడా కొంత యిస్తామని చెప్పి ధర్మయ్యగారిని తథాస్తనిపించేసరికి నాతలప్రాణం తోకకు వచ్చిందనుకోండి.

శ్రీహ : రొఖ్ఖంకూడా పెట్టేవూ? సరే! వారు ఆమోదించేక అభ్యంతరం...

గణ : లేకపోవడం యేఁవిటి ? అరవై కాసుల బంగారంయిస్తాం అంటేనేగాని పెళ్లికూతురు పేచీ పెట్టడం మాని అన్న గారి ముఖంచూచి ముసి ముసి నవ్వు నవ్వలేకపోలేను.

శ్రీహ : నవ్వుకుని చివరికి సరే! అందిగా ?

గణ : సరే అనక సగంబంగారం ముందు పంపించి నీయిష్టం వచ్చిన నగలుచేయించుకోమని, కబురుచేసేమంటే కళ్ళు గిర్రునతిరిగి కాదనలేకపోతారండి. అదంతా మీకెందుకు ?

శ్రీహ : కాదంటే...ధర్మయ్యగారు మనబంగారం మనకు తక్షణం పంపించివేస్తారు.

శ్రీహ : భాస్కరరావు ప్రతిబంధకం యేఁవీవుండదుగదా?

గణ : భాస్కరరావు ప్రేమేయం దీనిలో యేంవుంటుందని మీ భయం?

శ్రీహ : భయంకాక యేఁవిటి? చెడగొట్టడానికి చేటపెయ్యిచాలు నయ్యా గణపతి!

గణ : ఆపయిని నేనున్నాగదండి.

అమర్ : (ప్రవేశించి) ఏమండి మామాజీ! యెందుకునన్ను పిలిచేరట.

శ్రీహ : ఏఁవుంది ? యీపట్టుకు నువ్వు మనపంచాయతీయెన్నికల్లో నన్ను బలపర్చాలి.

అమర్ : అది నావల్ల అయ్యేపనికాదు.

శ్రీహ : ఎందుకని ?

అమర్ : ఇష్టంలేక.

శ్రీహ : నేను పంచాయతీబోర్డు ప్రెశిడెంటునవడం నీకుయిష్టం లేదా ?

అమర్ : లేదని చెప్పేనుగదండి.

శ్రీహ : లేకపోతే నువ్వు నిలబడు నిన్ను బలపరుస్తాను. సరేనా?

అమర్ : ప్రజల్లోవుండి దేశానికి చేతనయిన సేవచేయడం తప్ప అధికారపీఠాన్ని అధిష్ఠించాలనే ఆశయం నాకు అణుమాత్రంకూడా లేదు.

శ్రీహ : "అమ్మ పెట్టనూ పెట్టదు అడుక్కుని తినానివ్వదూ" అని నీ వ్యవహారం యేంవీ బాగుండలేదు.

అమర్ : ఎలా బాగుంటుంది? కపటోపాయ ధురీణుడయిన గణపతితో కలిసి దేవునిసొమ్ముల్ని దిగమింగేదిచాలక పంచాయతీబోర్డునుకూడా తమపర చేసుకుని ప్రజలసొమ్ముల్ని కూడా పంచుకోవడానికేగాని, పవిత్రాయశయంతో కాదుగదండీ? మీరీ పంచాయతీబోర్డు ప్రెశిడెంటుపదవి కావాలని పాకులాడ్డం ?

శ్రీహ : (కోపంతో) "చేత రేణువంతమాట మేరువంత" అని యేంవిట్రా నీ వ్రాకదంపుడు ప్రసంగం ?

గణ : నేలకుపోయేది నెత్తికిపులుముకుంటా వెందుకు చినబాబు!

అమర్ : (ఆవేశంగా) ఎందుకాకలిసివస్తుందనే కాంక్షతో నీలా నేనేమీ యే గాలి కా తెర యెత్తే నీచుణ్ణిగానుగనుక.

శ్రీహ : (కోపంతో) కాక నువ్వు మహాదేశోద్ధారకుడవు కాబోల్ను.

అమ : దేశోద్ధారుకుణ్ణని చెప్పుకుంటూ మీలా ప్రజలనెత్తుల్ని కొట్టి, బ్రతుకుతూవుండే, ప్రజాద్రోహినిమాత్రంకాను లెండి.

గణ : పెద్దా, పిన్నా తారతమ్యం లేకుండా ధిక్కరించి మాట్లాడ్డం మంచిదికాదు చినబాబు !

అమ : (హేళనగా) పెద్దలట! పెద్దలు, ఎందుకు పనికివచ్చే పెద్దలు మీరు? డబ్బుసంపాదించాలనే పెద్దజబ్బుతో, న్యాయాన్యాయాల్ని. పాపపుణ్యాల్ని పాటించకుండా ఒక్కవాళ్ళి బాధించడమే పనిగాపెట్టుకుని ప్రవర్తించే నరరూపరాక్షసులయిన మీారేనా? పెద్దలు! (వికటంగా నవ్వి) ఎవరుపెద్దలో, ఎవరుపిన్నలో యెవరికివారు ఆత్మావలోకనం చేసుకుంటే అర్థమవుతుంది.

శ్రీహ : (క్రోధావేశంతో) ఏంవిట్రా! అర్థమయేది? "గ్రుడ్డువచ్చి పిల్లని వెక్కిరించింద"ని నువ్వా!మాకునీతులు నేర్పేది?

గణ : (సాంత్వనంగా) అతిగుంభనగా నడచిపోతూవున్న సంసారాన్ని, నలుగురినోళ్లో పడవేస్తూ నీ వ్రేలితో నీకన్నే పొడుచుకోవడం నీకే నష్టంసుమా చినబాబు !

అమ : (నిర్లక్ష్యంగా) నష్టంవచ్చినా, కష్టంవచ్చినా సత్యధర్మాలు తోడునీడలుగాగల నేనుమాత్రం మీలా మేకవన్నె పులినికాను. న్యాయదూరంగా నడవడానికి.

శ్రీహ : న్యాయంలేకుండా నడిచేది మేమే అంటావ్ !

అమ : కాదని గుండెమీాద చేయివేసుకుని చెప్పగలరా ?

శ్రీహ : ఏమిటి మేం చేసిన అన్యాయం ?

అమ : ముంజేతి కంకణానికి అద్దం కావాలంటారా ?

శ్రీహ : చెలపాముతో చెర్లాటం చేటుకాలానికని తెలుసుకోవాలి.

అమ : తెలుసు ! పాముపడగ నీడన పండుకోవడం ప్రమాదం అని నాకు బాగా తెలుసు.

గణ : తెలుసుండికూడా అమ్మో విరిచుకుని మామీదకు వస్తున్నావన్నమాట !

అమ : రాక ! సామరస్యంగా కార్యసాఫల్యం కానప్పుడు శరణ్యం యేముంది మరి?

శ్రీహ : పరిస్థితులు నీకు ప్రతికూలమయ్యాక పశ్చాత్తాపపడి ప్రయోజనం లేదు. ఏమనుకున్నావో ?

అమ : ఏమనుకుంటాను. ఒకరి నొకరు బెదిరించే రోజులు; ఒకరికొకరు బెదరే రోజులుపోయాయని, మీరుయిప్పటికయినా తెలుసుకోవడం చాలా మంచిదనుకుంటాను.

గణ : అంతేగాని, నీమంకుపట్టు వదలి మాతో సహకరించనంటావ్ !

అమ : సహకరించడానికి వేడినీళ్ళకు యిళ్లుకాల్తాయనే వెర్రిభయంతో మీ అడుగులికి మడుగులొత్తే అధముణ్ణికాను

శ్రీహ : అయితే అసలువిషయం చెబుతున్నా విను. యీనాటినుంచి నీ అభిప్రాయన్ని మార్చుకుని యింట్లో కూర్చుని వుండకపోతే నీ ఆస్తిలో ఒక గ్రుడ్డిగవ్వకూడా నీకు చెల్లనివ్వను.

అమ : (ఆవేశంగా) చెల్లనివ్వక మీ ఆస్తితోపాటు మా ఆస్తికూడా నెత్తిని కట్టుకుని వూరేగండి.

గణ : వెనుకముందులు విచారించకుండా మేఘాల్ని నమ్మి చెరువునీరు తెగ్గొట్టుకొనడం తెలివితక్కువచిన బాబు!

అమ : (హేళనగా) తెలివిగలవారు బయలుదేరేరు! "తాటాకుచప్పుళ్ళకుకుందేళ్లు బెదరవ్! వెళ్ళవయ్యా! చెప్పేవ్ యిందుకేనా మీరు పిలిచింది.

శ్రీహ : అవును. అందుకే! సరియయిన సమాధానం చెప్పకుండా వీధిగుమ్మందాటావంటే! దేవిడీమన్నా చేయించి కాళ్ళుపట్టుకుని కరుణించమన్నా నిన్నుకన్నెత్తిచూడను.

అమ : (నిర్భయంగా) ఆలాంటి దీనస్థితి చివరకు మీకే వస్తుందేమో! దీర్ఘంగా యోచించుకొని మాట్లాడ్డం మంచిది. మామాజి! (వెళ్ళబోవును)

శ్రీహ : (క్రోధావేశంతో) ఆగు! ఏంవిట్రా పేలేవ్!
(పన్నుగఱ్ఱతో బుఱ్ఱమీద కొట్టును)

అమ : (దెబ్బతో అబ్బా! అంటూ పడిపోవును)

గణ : (కంగారుగా అమర్‌నాథునివద్దకు వెళ్ళి రక్తంచూచి) అయ్యో! అయ్యో! ఎంతరక్తం! యెంతరక్తం! ఇంగితజ్ఞానంలేకుండా యింత తెలివితక్కువపనిచేసేరేంవిటి? రావుగారు!

అమ : (గిలగిలా కొట్టుకుంటూ వుండును)

శ్రీహ : (చూచి భయంతో) గణపతి! తలుపులన్నీ వేసి త్వరగా మన డాక్టర్ని తీసుకునిరా! వెళ్ళు వెళ్ళు.

గణ : (అమర్‌నాథ్ జేతినాడిచూచి కంగారుగా) కొంప కొల్లేరులో ముంచేసారు నేను మనడాక్టరుగారిని తీసుకుని వచ్చేవరకు మీరు యిక్కడే వుండండి. (తలుపులు వేసి వెళ్ళిపోవును)

శ్రీహ : (భయకంపితుడై యిటునటూ తిరుగును)

(తెరపడును)

శ్రీః

# (అష్టమదృశ్యం)

(ధర్మయ్యగారి యిల్లు ప్రభావతి అమర్‌నాథ్ ఫోటో చేతబట్టుకొని ప్రవేశించును.)

ప్రభా : (ఫోటోను చూస్తూ మురిసిపోతూ)

చ॥ అసమవిలోచనైక జనితానల పాతవిదగ్ధమూర్తియై
కుసుమశరుండు లోకమునకుం గనుపింపక యుంటచేత నీ
యసదృశ రూపవంతు నపరాంగజు బ్రహ్మ సృజించె లేక యీ
మిసమిసలాడు బంగరపు మేనిగలాడు ధరిత్రిఁ బుట్టునే ?

(గోడకు తగిలించబోతూఉండగా చేతినుంచి జారి ఫోటో క్రిందపడి అద్దం పగిలిపోవును. అది అపశకునముగా భావించి విచారంతో) "హేతువులేక తీతువు కూయదు" లేకపోతే యీ ఫోటో క్రిందయెందుకు పడాలి ? శరీరాలు రెండు అయినా ఆత్మ మాత్రం వొకటే, అనుకొను మా ప్రేమపాశానికి భగం కలుగదుగదా ? (ధైర్యంగా) కలగడానికి వీల్లేదు. నా ఆత్మఫలక చిత్రితుడయిన నా అమర్

నాథునికి నాకు మధ్య యినుపతెరను వేయడానికి యెవరికి సాధ్యంకాదు. (దీర్ఘంగా నిట్టూర్పు విడిచి చితికిన అద్దపు పెంకులు యేరి దూరంగా పారవైచి ఫోటో డ్రాయరులో పెట్టి తన కులదేవత యెద్దకు వెళ్ళి నిలబడి నమస్కారపూర్వకంగా)

శ్లో॥ కాత్యాయని ! నమస్తుభ్య మార్తావన పరాయణే !
పాహిమాం కరుణాశీలే ! శరణాగత వత్సలే !

(దండకం — హిందోల్)

శ్రీమన్మహాభద్రకాళీ ! అమర్త్యేష్ట వాక్పాళి ! రత్న ప్రభాబంధు రచ్ఛన్నహారావళీ ! దుష్టదైతేయ రాడద్రిదంభోళి ! సద్భక్త సంపూరితానేక వాంఛావళీ ! సర్వ సౌజన్యరింఛోళి ! శిష్టాయుమన్పర్శనవ్యాళి ! సాధ్వీమతల్లీ ! శ్రితవ్యూహ సత్కల్పవల్లీ ! భవద్భవ్యలీలాను మేయ ప్రభావంబుచే సూర్య చంద్రాదులాకాశ మధ్యంబునన్ లోకకళ్యాణ సంధానధారేయులై దివ్య తేజస్కులై వెల్గుచున్నారు. కాలాను గుణ్యంబుగాఁ బంచభూత ప్రవృత్తుల్ భవత్పూత కారుణ్య పీయూష వర్షంబుచేతన్ బ్రవర్తిల్లునో భక్తచింతామణీ ! సర్వగీర్వాణ చూడామణీ ! లోక సంచారిణీ ! పాపసంహారిణీ ! మంజువాణీ ! భవన్మాయచేతన్ సమస్త ప్రపంచంబునన్ గల్గు జీవాళి జన్మించి పెంపొంది నాశంబునందున్ లసద్దివ్య కస్తూరికా చర్చితా ! సర్వ దిఙ్మండల వ్యాపి మాణిక్య తేజః స్ఫురత్కంకణాలంకృతా! రత్నపీఠస్థితా ! విస్ఫురద్రత్న సంస్థాపిత స్వర్ణ కేయూర కాంతిచ్ఛటాప్రోల్లసద్దోర్లతా ! విభ్రమాలంకృతా ! సర్వలోకైకమాతా ! భవత్పాద నీరేజయుగ్మంబు భక్తిప్రశస్తంబుగా హృత్సరోజంబునన్ బూజఁగావింతు నాదోషముల్ సైచి కాపాడుమో ! తల్లీ ! కాత్యాయనీ ! ధీమణీ ! పాహిమాం శ్రీభవానీ ! నమస్తే నమస్తే నమస్తే నమః ౽

(అని ప్రార్థించి కుర్చీలో పరధ్యాన్నముగా కూర్చుండును)

ధర్మ : (ప్రవేశించి) ఏంపాపాయ్! పరధ్యాన్నంగా కూర్చొని ఏఁపిటలా ఆలోచిస్తున్నావ్!

ప్రభా : (ఉలిక్కిపడి లేచి) ఏఁవీ లేదు నాన్నగారు. యెక్కడికో వెళుతున్నావని బయలుదేరి వెళ్ళలేదేఁవండి ?

ధర్మ : వెళదామని వీధిలోకి వెళ్ళేసరికి గణపతిగారు బంగారం పంపించి నన్ను రావద్దని కబురుచేసేరు.

ప్రభా : (సందేహంతో) ఎవరికి నాన్నగారు? ఆబంగారం!

ధర్మ : ఎవరి కేఁవిటి? నీకే పాపాయ్ !

ప్రభా : (విస్తుపోయి) నాకా ! ఎందుకుపంపేరు ?

ధర్మ : ముందుగా సగంబంగారం పంపమంటే పంపేరు !

ప్రభా : (కంగారుపడి) ఎవరుపంపమన్నారు? ఏఁవిటీ కుతంత్రం నాన్నగారు ?

ధర్మ : కుతంత్రం యేఁవుంది? మనంయివ్వదలచిన బాకీరద్దుచేసి, అరవయికాసుల బంగారంయిస్తే! శ్రీహరిరావుగారిని పెళ్ళిచేసుకుంటానన్నావటగా ?

ప్రభా : ఆమాట నేను అనలేదు నాన్నగారు !

ధర్మ : మరి యేంమాట అన్నావ్ !

ప్రభా : నేనూ, అన్నయ్య చదరంగం ఆడుకుంటూవుండగా గణపతిగారు వచ్చి త్రాగినవానిలా పిచ్చిపిచ్చిగా వాగుతూవుంటే...

ధర్మ : సరే! అన్నావ్.

ప్రభా : లేదు విడిచిపెట్టకుండా యిది యిస్తాం, అది యిస్తాం అంటూ వేధించుకుని తింటూవుంటే! "సరే! వెళ్ళండి మానాన్నగారితో మాట్లాడి కబురుచేస్తాం" అనిమాట వరసకి అన్నయ్య అన్నాడు.

ధర్మ : పెళ్ళాడేదానవు నువ్వయితే! అన్నయ్య సరే! అనడంలో అర్థం యేఁవుంది ?

ప్రభా : అర్థంలేక యథాలాపంగా అన్నయ్య అన్నమాటను యదార్థం అనుకోవడంలో అర్థంవుందంటారా?

ధర్మ : (విసుగుదలగా) అయితే! నువ్వనేదేఁవిటి?

ప్రభా : వెంటనే వారిబంగారం వారికి పంపివేయమంటాను.

ధర్మ : అవును కాదని పెద్దవాళ్ళతో పేచీ పెట్టుకోమంటావు.

ప్రభా : పేచీపెట్టుకోవలసినంత ప్రమాదం యేంవచ్చిందంటారు?

ధర్మ : మీరిద్దరు ఒక పెద్దమనిషిదగ్గర సరే! అంటే నేనుకూడా సరే అని సమ్మతించేను.

ప్రభా : ఆదిలో అనుకున్న అమర్ నాథునికిచ్చి పెళ్ళిచేయడానికి అభ్యంతరం యేంవచ్చింది నాన్నగారు ?

ధర్మ : అభ్యంతరంకాక? కట్నాలిచ్చి నువ్వుకావాలన్నవాణ్ణి పెళ్ళిచేయగలమా?

ప్రభా : కట్నం కావాలని అమర్ నాథ్ మిమ్మల్ని అడిగేరా ?

ధర్మ : అడగకపోతేమాత్రం! కళ్లారాచూస్తూ కలిమిలేనివానికి కన్యాదానం చెయ్యగలమా ?

ప్రభా : కలిమి లేకపోవడానికి అమర్ నాథుని ఆస్తి ఆ రావుగారు హరించాలని ఆలోచిస్తున్నారా ?

ధర్మ : ఆలోచించేదేముంది ! పండ్రెండేళ్లు శ్రీహరిరావుగారి హక్కుభుక్తంలోవున్నఅస్తి క్రొత్తచట్టంప్రకారం హైకోర్టుకెక్కినా అమర్ నాథునిపరం కాదని, బాహాటంగా పెద్దపెద్ద ప్లీడర్లు బల్లగుద్ది మరీచెప్పేరట.

ప్రభా : (యెత్తిపొడుపుగా) అలాచెప్పకపోతే ! ఉన్నది లేని దిగా, లేనిది వున్నదిగా కల్పించి కయ్యాల్ని పెంచే యీ పేచీకోరు ప్లీడర్లకి, ఫీజులర్పించుకునే పెద్దన్నయ్యాలు యెవరువుంటారు? నాన్నగారు !

ధర్మ : ఎవరేం చెప్పినా చెవులేగాని, కళ్ళులేని న్యాయస్థానంలో విత్తంలేనవారి మాటకు విలువుండదుగా ?

ప్రభా : విలువున్నా లేకపోయినా ? సత్యాహింసల మీద సంపూర్ణ విశ్వాసంగల అమర్‌నాథునికి మాత్రం కోర్టుల కక్కా కోర్కా యేకోశాన్ని లేదట.

ధర్మ : అందుకే! నేను నిన్ను వానికివ్వడాని అనుమతించక పోవడం కూడాను !

ప్రభా : అనుమతించక పోవడానికి భాగ్యం లేకపోతేమాత్రం అమర్‌నాథ్ భార్యను పోషించికోలేరా ? విజ్ఞానికి విదేశం వెళ్ళినా; స్వదేశంలోవున్నా కూటికి గుడ్డకి లోటుమాత్రం రాదు నాన్నగారు !

ధర్మ : లోటు రాదనుకుని గతిమాల్నివాణ్ణి కట్టుకుని అడుక్కు. తింటావు కాబోల్ను ?

ప్రభా : (ఆవేశంగా) ఆమాట యెవరుచెప్పగలరు నాన్నగారు "కలిమిలేములు కావడికుండల"ని ఓడలు బళ్ళు, బళ్ళు ఓడలు అయ్యే యీ కాలంలో నేటిలక్షాధికారి రేపు భిక్షాధికారి; రేపటిభిక్షాధికారి యెల్లుండి లక్షాధికారి కాకూడదంటారా ?

ధర్మ : అందుకు నువ్వనే దేఁవిటి ?

ప్రభా : నేననేది. ఆదర్శగృహిణి అనుకూలుడయిన భర్తతో కలిసి అడుక్కు తింటూ ఏ చెట్టునీడనయినా బ్రహ్మా నందంగా బ్రతకవచ్చునని.

ధర్మ : భవిష్యత్తులో నీ జీవితం అడవిపూసిన పుష్పంలా వ్యర్థ మయిపోతుందని నువ్వు అర్థ చేసుకోవడంలేదు.

ప్రభా : (నిస్పృహగా) ఎవరి కర్మకు యెవరుకర్తలు? నాన్నగారు

సీ॥ సచరాచరాత్మకజగముల సృజియించు
 లోకేశునకుఁగొంప లేకపోయె
బ్రహ్మాండజాలైక పరిపాలకుండైన
 శౌరిఁభుజంగమశాయియయ్యె
అష్టసంపద్వ్యక్తుఁడగు నష్టమూర్తికిఁ
 దిరుపంబుఁజేయక తీరదాయె
సర్వలోకానంద సంధాయకుండైన
 శౌరిసుతుం డశరీరుఁడాయె

తే॥ అట్టి లోకోపకారకులైన బ్రహ్మ
విష్ణు శంకరస్మరులకే వెతలుగుడవఁ
దప్పలేదన నెవరికిఁ దప్పునింక
మానవాళికి నీరీతి మహితలమున.

ధర్మ : అందుకని తెలిసికూడ కష్టాల్ని ఆహ్వానించి కడ గండ్ల పాలవుతావా ? పాపాయి !

ప్రభా : (తెగింపుతో) వద్దనుకుంటే వచ్చేకష్టాలు రద్దయి పోదాయంటారు ?

ధర్మ : (కోపంతో) నీ మెట్టవేదాంతం కట్టిపెట్టి నే చెప్పిన మాట వింటావా ? లేక నేపట్టిన కుందేటికి మూడే కాళ్ళంటావా ?

ప్రభా : (దీనంగా) ఎట్లాగ వినేదినాన్నగారు! మీమాట ?

ఉ॥ మానసికంబుగాగ నొకమాన్యుని దొల్త వివాహమాడి, నా
మానస మావిశాలమతిమంతునకుంబరిపూర్ణ మానమిచ్చి, త
న్మానసమున్ గ్రహించితిని, మక్కువమై యిదిలోకసమ్మతం
బైనపథంబు కన్యకల కాచరణీయవిధంబు ధాత్రిపై.

ధర్మ : అయితే! నా ఆర్థికదుస్థితి ఆలోచించకుండా స్వయం నిర్ణయాధికారంతో మాట్లాడ్డం నీకు మర్యాదంటావు?

ప్రభా : (ఆవేశంగా) కాక! తలిదండ్రులు తమ తలభారాల్ని తగ్గించుకోవడంకోసం యువతీ యువకుల కోర్కెలకు విరుద్ధంగా వివాహాలు చేస్తాననడంమాత్రం విధ్యుక్త ధర్మమంటారా ?

భాస్క : (హుంటాహుంటిగా ప్రవేశించి) ధర్మానికి యీకాలంలో తావులేనప్పుడు తలవొగ్గడంతప్ప కాలప్రవాహానికి గట్టువేయడం మనవల్లకానిపని చెల్లాయ్ !

ప్రభా : (చూచి) అందుకని మనంకూడా గడ్డిరికా ప్రవాహాన్యాయంగా ఆ ప్రవాహంలో కొట్టుకొని పోవలసిందే నంటావా ? అన్నాయ్ !

భాస్క : (నిస్పృహగా) కొట్టుకొనిపోక ! గడ్డిపోచను పట్టుకుని వేగంగా ప్రవహించే యేటికి యెదురీదగలమా ? చెల్లాయ్ ! వెఱ్ఱిమాటాడుతావ్.

ధర్మ : (సందేహంగా) ఈవేళ యింత త్వరగా నచ్చావ్! ఏఁవిటబ్బాయి ?

భాస్క : (దీనంగా) రాక్షసకార్యం జరిగింది.

ధర్మ : దార్జన్యానికికూడా తలపడ్డారా ?
భాస్క : తలపడడమేకాదు దయా దాక్షిణ్యాలు లేకుండా (శ్రీ)హరిరావుగారు పన్నుగడ్డతో అమర్ నాథ్ తల భల్లున పగలగొట్టేరు.
ధర్మ : (కంగారుపడి) పగలగొట్టడమే ? పాపం !
ప్రభా : (వ్యాకులపాటుతో) ఆస్తినంతా అపహరించాలనే ఆశయంతో రావుగారు ప్రాణాలు తీయడానికికూడా పాల్పడ్డారన్న మాట.
భాస్క : అవును చెల్లాయ్ ! అమర్ నాథ్ బ్రతికివుంటే త్రోసి రాజని తనఆట కట్టేటట్టు వున్నాడని గణపతి చెప్పిన పుల్లవిరుపుమాటలు పురస్కరించుకొని అన్యాయంగా అమర్ నాథుని పొట్టబెట్టుకున్నారు.
ప్రభా : (దుఃఖావేశంతో మూర్ఛిల్లును.)
ధర్మ : (ప్రభావతిని లేవదీసితనఒడిలో కూర్చొనబెట్టుకొనును.)
భాస్క : (నీళ్ళు తెచ్చి ప్రభావతి ముఖముమీద కొట్టును.)
ప్రభా : (సేదదేరి విధివిధానమునకు విచారిస్తూ మౌనముగా కూర్చొని వుండును.)
ధర్మ : డాక్టరుగారిని పిలిపించలేదా ? భాస్కరరావ్ !
భాస్క : (వ్యంగ్యంగా) పిలిపించేమండి ! ధర్మప్రభు వైన ఆ ధర్మాసుపత్రి డాక్టరుగారు తమకున్నారుగా ! వైద్యంచేయడానికి ?
ప్రభా : (మందస్వరంతో) డాక్టరుగారు వచ్చి ఏమన్నారు అన్నాయ్ !

భాస్క : (వ్యంగ్యంగా) ఏం వంటారు ! ఆసుపత్రికి పంపమని తాత్కాలిక వైద్యంకూడా చేయకుండా వెళ్ళిపోయారు.

ప్రభా : బాగుచేయించి బ్రతికించాలనే భావంగలవారయితే ! శ్రీహరిరావుగారు చావుబ్రతుకుల్లో వున్నవారిని ఆ డాక్టర్‌గారిచేతిలో యెందుకు పెడతారు!

భాస్క : (అక్కసంతో) చేతిలోపెట్టి ఆ శ్రీహరిరావుగారు వూరుకున్నారా? అపాయంవచ్చినా తమమీాదికి యేంవీ కేసు గాకుండా వెంటనే గణపతిద్వారా మునసబ్‌గారి కిచ్చేముడుపులు మునసబ్‌గార్కి, కరణంగారి కిచ్చే కానుకలు కరణంగార్కి చెల్లించి, మేడమెట్లు నుంచి కాలుజారిపడితే ! తలకాయచితికిందని ధర్మాసుపత్రి డాక్టర్‌గారితో తక్షణం పత్రంవ్రాయించుకుని నిర్విచారంగా కూర్చున్నారు

ధర్మ : మీాసంఘంవారయినా ఆ ధర్మాసుపత్రినుంచి తప్పించి మరో ఆసుపత్రికి. . .

భాస్క : పంపించమనిచెప్పే యిలా వచ్చానండి!

ప్రభా : (నిట్టూర్పువిడిచి దీనంగా) యెక్కడికిపంపించి యేం లాభం ? అడుగుజారినకుండ అతుక్కోవడం అసంభవం

ధర్మ : అది నిజమేగానీ ! మానవప్రయత్నంచేసి భగవంతుని మీాద భారంవేయడమేగా? మనవల్లఅయ్యేపని ?

ప్రభా : యేమయినా మాప్రణయాకాశంలో ప్రళయమేఘాలు ఆవరించి పిడుగుపాటులయ్యేకకూడా! ఆపిచ్చినమ్మకాలు పెట్టుకోవడం యెందుకు నాన్నగారు!

ధర్మ : ఏనమ్మకంపెట్టుకొని మానవమాత్రులమయిన మనం చేసేదేముంది? పాపాయ్ !

ప్రభా : (తెగింపుతో) చేసేదెందుకులేదండి ?

ధర్మ : ఏంవుందంటావ్ !

ప్రభా : జరిగిందేదో జరిగిపోయింది. యింక మీయిష్టప్రకారం శ్రీహరిరావుగారిని పెళ్ళిచేసుకోవడానికే నిర్ణయించుకున్నాను.,

భాస్క : (నిర్ఘాంతపోయి) మతిమాలిన మాట మాట్లాడుతున్నావేఁవిటి ? చెల్లాయ్ !

ప్రభా : మతిమాలినమాటకాదు నేనాడింది.

భాస్క : అయితే నువ్వనేదేఁవిటి ?

ప్రభా : (నిస్సంకోచగా) నేననేది తరువాత నెమ్మదిగా చెబుతాగానీ నాన్నగారు! శ్రీహరిరావుగారు పంపించిన బంగారం నాచేతికిచ్చి మీరుబయలుదేరివెళ్ళి నోటు జమకట్టించుకుని ఆనోటూ, యింకాయిస్తామన్న బంగారం డబ్బు తీసుకుని మూహూర్తంపెట్టించి పంపమని చెప్పిరండి. వెళ్ళండి.

భాస్క : (బాధగా) భాగ్యవంతుడు భర్తగా అఁవిరితే! బంగారంతినవచ్చునని భావిస్తున్నావా? చెల్లాయ్ !

ప్రభా : అవును. ఉన్నవాడిని వివాహమాడి పెళ్ళిపీటలమీద ముండమోపినయినా అన్నిరుచులు ఆరగిస్తూ బ్రతికినంతకాలం బ్రహ్మానందంగా వుండవచ్చు.

భాస్క : అదేం వీల్లేదు? చెల్లాయ్ !

ప్రభా : ఎందుకని వీల్లేదు? అన్నాయ్!

భాస్క : కర్తవ్యతావిమూఢవయి గండకత్తెర్లో నువ్వు కంఠం పెడుతూవుంటేకళ్లారాచూస్తూ మేమెలావూరుకుంటాం?

ప్రభా : ఊరుకోకపోవడానికి నాకష్టసుఖాలు నా బాగోగులు నాకు తెలియవని భావిస్తున్నావా ? అన్నాయ్!

భాస్క : (దురుసుగా) ఏఁవిటి నీకు తెలిసింది ? తీగెలు తెగిన వీణమీద సంగీతాన్ని సాదన చేస్తాననడమేనా ?

ప్రభా : కాదు. నేను పరిణయం ఆడాలన్నవారు ప్రమాదానికి గురికావడం కారణంగా యింకనా పెళ్లిగురించి నాన్న గారిని ఆర్థికంగా యిబ్బంది పెట్టడానికి యిష్టంలేక యిప్పుడు నామనస్సును యిలా మార్చుకున్నాను. నాన్నగారు! యీ సాయంకాలం లోపున మీరు ముహూర్తం పెట్టించుకుని రాకపోయారా? తెల్లవారే సరికినా శవాన్ని కళ్లచూస్తారు వెళ్లండి! యిప్పుడే వెళ్లండి.

భాస్క : నాన్నగారు! చెల్లాయి పిచ్చెత్తిమాట్లాడుతూవుంది. మీరు యిప్పుడు యెక్కడికి వెళ్లవద్దు.

ప్రభా : (ఆవేశంగా) వెళ్లాలి. యిప్పుడే వెళ్లాలి. నిమిషం ఆగేరా? నే చెప్పినంత పనిచేసితీరుతాను.

ధర్మ : (భయంతో) వెళతానమ్మ నీయిష్టప్రకారం యిప్పుడే వెళతాను. (వెళ్లను)

భాస్క : (ఉడుకుబోతుతనంతో) చెల్లాయ్! నువ్వు అశాశ్వతమయిన ఐశ్వర్యానికి ఆశించి అరవై యేళ్ళవానిని పెళ్ళాడడానికి అనుమతిస్తావని కలలోకూడా అనుకో లేదు. "విపత్తికాలే విపరీత బుద్ధి" అని అందుకే అన్నారు. సరే! నీ కర్మకు నేను కర్తనుకాను. (వేగంగా వెళ్లును)

(తెరపడును)

శ్రీః

# (నవమ దృశ్యం)

(సర్వోదయ సమాజాశ్రమం. దయానందస్వామి ఆసనముపయిని కూర్చుండి సభ్యులతో బృంద గానంచేస్తూ వుండును).

పాట — యమునా కళ్యాణి — ఆది

"రఘుపతిరాఘవ రాజారామ్
పతిత పావన! సీతారామ్ ||రఘు||

ఈశ్వర అల్లా తేరేనామ్
సబ్ కో సన్మతి దే భగవాన్ ||రఘు||

సుందరవిగ్రహ! మేఘశ్యామ్
గంగాతులసీ సాలిగ్రామ్ ||రఘు||

భాస్క : (ప్రవేశించి) నమస్కారమండి! స్వామి!

దయా : (చూచి) దీర్ఘాయుష్మాన్ భవ. ఎవరవు నాయనా! నువ్వు!

భాస్క : దానాలధర్మయ్యగారి కుమారుణ్ణి స్వామి !
దయా : ఓహో ! నువ్వు ధర్మయ్యగారి అబ్బాయివా ? నీ పేరేవిటి ? నాయనా !
భాస్క : భాస్కర్రావు అంటారండి స్వామి !
దయా : మీ గ్రామయువజన సంఘకార్యదర్శివి ! నువ్వేగా?
భాస్క : చిత్తం స్వామి !
దయా : (జిజ్ఞాసతో) అయితే ! రాత్రి మీ సంఘసభ్యులు కొనవూపిరితో వున్న అమర్‌నాథుడనే యువకుణ్ణి మా ఆశ్రమానికి వైద్యం నిమిత్త తీసుకునివచ్చారు. నువ్వెరుగుదువా ?
భాస్క : (ఆతృతగా) ఎరుగుదును. బ్రతికివున్నాడా స్వామి !
దయా : భగవదనుగ్రహంవల్ల బ్రతికి బయటపడ్డాడు పాపం !
భాస్క : (సంతోషంతో) ధన్యులమయ్యామండి. స్వామి ! మీ అనుగ్రహంవల్ల మా అమర్‌నాథ్ సార్థకనామధేయుడయ్యాడు.
దయా : దీనావన దీక్షితుడయిన జగదీశ్వరుని అనుగ్రహమే గాని. నాకర్తృత్వంయే వీల్లేదు నాయనా !
భాస్క : లేకపోవడమేమిటి స్వామి ! ఆదయామయుని అపరావతారులయిన మీ అమృతహస్తం చనిపోయేదన్న మా మిత్రుణ్ణి సంజీవినిలా పునర్జన్మణ్ణి చేసింది.
దయా : దైవం అనుకూలంగావుంది గనుక, మీ మిత్రుడు బ్రతికేడు. కాని ఆయువు పట్టునతగిలిన ఆ దెబ్బకు అందరు బ్రతకరు. నాయనా !

భాస్క : అవునండిస్వామి ! ధర్మాసుపత్రి డాక్టర్ గారు బ్రతకడని విడుచిపెట్టేక, మా సంఘసభ్యులు సాహసించి మీ ఆశ్రమానికి తీసుకుని వచ్చారు.

దయా : అయితే ! అలాకొట్టింది అతని మేనమామగారే నటగా ?

భాస్క : (ఆవేశంగా) అవునండిస్వామి ! ఆ పరమదౌర్భాగ్య దామోదరుడే, ఆపాపానికి పాల్పడిన పాషాణహృదయుడు.

దయా : దయాదాక్షిణ్యాలులేనివానికి ధర్మాధర్మ వివక్షత వుండదు నాయనా !

భాస్క : ధనదేవతావేశంతో శివమెత్తి చిందులుత్రొక్కే చండాలునికి దయాదాక్షిణ్యాలు యెలా వుంటాయండి!

దయా : మానవులు లోకంలో తెలిసి పాపాలుచేసి తెలియక వాని ఫలితాల్ని అనుభవిస్తారు.

భాసరు : "గోరుచుట్టుమీద రోకటిపోట"న్నట్టు రాత్రి మా చెల్లాయికూడ మాయమయిపోయింది.

దయా : ఆమెకు యెన్నియేండ్ళువుంటాయి?

భాస్క : పద్దానుగేళ్ళు దాటివుంటాయండి స్వామి !

దయా : ఆమె యెరుపా ? నలుపా ?

భాస్క : నిమ్మపండులా నిగనిగా లాడుతూ వుంటుందండి

దయా : అయితే ! యీ తెల్లవారుజామున, నదిలో కొట్టుకుంటూ వస్తూ మాకు దొరికిన అమ్మాయి మీ చెల్లాయి కాదుగదా ?

భాస్క : (ఆత్రుతగా) యీ యేటిలో దొరికిందాండి స్వామి !

దయా : అవును ..అయితే ఆమెకు నదిలోపడవలసిన తెగింపు యెందుకు యేర్పడిందంటావ్ !

భాస్క : మా స్నేహితునికి యీ అనర్థం సంభవించిదని పిచ్చెత్తి అలాంటిపని చేసివుంటుంది.

దయా : ఆమెకు అలాంటి సాహసం చేయవలసిన అవసరం యేంవుంది ? మీ స్నేహితునికి అనర్థంవస్తే ?

భాస్క : (ఆదుర్దాగా) ఆవిషయం తరువాత చెబుతాగానండీ స్వామి ! ఆయిద్దఱు యిప్పుడు యెక్కడవున్నారండి !

దయా : (వేలితో కనపరుస్తూ) అదిగో ! అమర్‌నాథ్ ఆ ఆరవ నెంబరుగదిలో వున్నాడు. ఆమెమాత్రం యింకా వైద్యం పొందుతూ మాడాక్టరుగారి వొద్దికలోనే వుంది. ఇప్పుడే నేను అక్కడనుంచి వచ్చాను.

భాస్క : (ఆత్రుతగా) నేను వెళ్ళివారినిచూచి రావచ్చునాండి!

దయా : ముందు, ఆ అమర్‌నాథ్ గదికివెళ్ళిచూచి యిక్కడికి వస్తే ! ఇద్దరం కలిసి ఆ అమ్మాయి వున్నచోటుకు వెళదాం నాయనా !

భాస్క : చిత్తంస్వామి ! (నమస్కరించి వెళ్ళును)

దయా : (తనలో) దైవనిర్ణయం యెంతటి గొప్పవారికయినా తప్పదు గదా ?

తే॥ సృష్టి సంస్థితిలయములఁ జేయునట్టి
పార్వతీ రమా భారతీపతులకైన
దేవతాకోటికైనను, దేహిఫాల
లిఖిత రేఖను, జెరుపను, లేదుశక్తి.

డాక్ట : (ప్రవేశించి) నమస్కారం స్వామి !

దయా : (చూచి సందేహంతో) ఏమండి! డాక్టర్‌గారు ! ఆ అమ్మాయికి యెలావుంది ? యింకా లేచి మాట్లాడ్డంలేదా పాపం !

డాక్ట : మాట్లాడకేమండి ! మరలా "ఏటిలో పడతా" నంటూ వెళ్ళిపోవడానికి సిద్ధపడిందిస్వామి.

దయా : అలా అన్నప్పుడు ఆమెను అక్కడవిడిచిపెట్టి మీరు యిలా యెందుకువచ్చారు ?

డాక్ట : కదలడానికి వీల్లేదని గట్టిగా కసురుకునేసరికి "స్వామి వారివద్దకు నేనుకూడా వస్తా" నంటూ ఆమెకూడా బయలుదేరిందిస్వామి !

దయా : బయలుదేరి మీరు యిలారావడంచూచి పరుగున పోయి మరలానదిలో పడదుగదా ?

డాక్ట : వెంకయ్యతాతను వెంటబెట్టుకునిరమ్మని చెప్పి, మీకు వొక విచిత్రవిషయం చెప్పడానికిముందుగా వచ్చాను.

దయా : ఏమిటండావిచిత్రవిషయం ?

డాక్ట : ఆమెపొట్టమీద మన ఆశ్రమ చిహ్నాలువున్నాయి.

దయా : (సందేహంతో) ఎందుకు వుంటాయ్ !

డాక్ట : ఏమో స్వామి ! ఆమెపొట్టమీద స్పష్టంగా చంద్ర కళాచిహ్నాలు చూసేసరికి నాకూడా ఆశ్చర్యం వేసింది.

దయా : అయితే ఆమె మన ఆశ్రమంలో పుట్టిందంటారా ?

డాక్ట : తప్పకుండాను.

దయా : (ఆలోచించి జ్ఞప్తినభినయించి) పదునాలుగేళ్ళకు పూర్వం మన ఆశ్రమంలో వొక అభాగిని ప్రసవించి పదిరోజులుగడిచేక పరారి అయిపోయింది. జ్ఞాపకం వుందాండి.

డాక్ట : (జ్ఞప్తి నభినయించి) అవునండిస్వామి. ఆనాడు ఆమె వ్రాసి తనగదిలో పారవైచినలేఖకూడా మీరుచదువుకుని దానిలోని విషయం తరువాత చెబుతానన్నారు కూడాను.

దయా : అవును. ఆలేఖ యింకా నాపెట్టెలోనేవుంది.

డాక్ట : పాపం! ఆనాడు అదృశ్యురాలయిన ఆ అభాగినిగాడ యింతవరకు మనకేమీ తెలియలేదుగదండి స్వామి!

దయా : ఏం తెలిసింది? మీరిప్పుడు చెప్పినమాటప్రకారం యీమె ఆ అభాగిని కూతురేమో!

డాక్ట : సరే ఆమెకూతురేఅయితే! యీమెవల్ల మనకు యథార్థం యిప్పుడే బయటపడుతుందిగదండి. (ప్రభావతి రాకచూచి) ఇదిగో! యీమెకూడా రానే వచ్చిందిస్వామి!

ప్రభా : (విరబోసివున్న వెండ్రుకలతో పిచ్చిదానిలా ప్రవేశించి) నమస్కారమండిస్వామి! (నమస్కరించును)

దయా : (చేతులెత్తి) దీర్ఘసుమంగళీభవ.

ప్రభా : (నిస్పృహతో) చీకటిముసుగులోదాగి అభాగ్యురాలనయివున్న నాకు, వెన్నెల వెలుగుచూడగల

యోగ్యతవుంటే! మృత్యుదేవతనుకోరి యెందుకు ఆహ్వానిస్తానుస్వామి!

దయా: ఆత్మహత్యకంటే మహాపాపంలేదను ఆర్యోక్తి తెలియదా అమ్మాయి!

ప్రభా: తెలిసి చావక జీవచ్ఛవాన్నయి జీవించివుండమంటారా? స్వామి.

డాక్ట: జీవించివుండక చచ్చి నువ్వు సాధించేది యేవర్ని చెప్పు?

ప్రభా: (దైన్యంగా) కర్మదేవత నన్ను తన కాలుపెట్టి నేలరాసి పారవేసింది. అందుకు యీజన్మలో నేను యింక చినిగిపోయిన గాలిపటంలా జీవించి అనుభవించేది యేమీలేదండి డాక్టరుగారు!

దయా: లేదని...నీభవిష్యత్తును నువ్వు యెలాచెప్పగలవమ్మాయ్.

ప్రభా: (మెల్లగా) చెప్పేదేముందండి! సంఘశాసనాన్ని వుల్లంఘించడం సాధ్యంకానప్పుడు, యెవరయినా చేసేదంతే నండిస్వామి!

డాక్ట: సంఘాన్ని యెదిరించి సాహసంతో కార్యాన్ని సాధించుకోవాలిగానీ, పిరికిదానవయి ఆత్మస్వాతంత్ర్యాన్ని అగ్నిపాలుచేసుకుంటావా? పిచ్చిదానా.

ప్రభా: ఆమాత్రం ఆత్మశక్తి లేనిదాన్నిగనుకే నాభగ్న జీవితాన్ని యింతటితో చాలించి సుఖదుఃఖరహితమయిన సుస్థిరలోకాన్ని చేరదలచేను డాక్టర్ గారు.

డాక్ట : నీబ్రతుకుమీద నీకింత నిరాశగలగడానికి కారణం కాస్తంత చెబుతావా ? పోని ?

ప్రభా : చెప్పి ప్రయోజనం యేముంది డాక్టర్‌గారు !

దయా : చెప్పకతప్పదు. అమ్మాయ్ !

ప్రభా : (దుఃఖంతో) నన్ను వివాహం ఆడదలచి వారు అర్థాయుష్కులయి, యిహలోకయాత్ర ముగించేరని విని, నేను భర్తృసహగమనానికి సాహసించానుస్వామి !

దయా : (చకితులై) భర్తృసహగమనమా ? ఎవర మ్మా నీభర్త.

ప్రభా : (గద్గదస్వరంతో) ఎ...వ...ర...యి...తేం... లెండిస్వామి !

దయా : అమర్‌నాథ్ కాదుగదా ?

ప్రభా : (గొల్లున యేడుస్తూ) అవునండిస్వామి ! (కాళ్ళపై పడును)

డాక్ట : (ఆశ్చర్యంగా) అమర్‌నాథా ! అయితే అతడు మా ఆశ్రమంలో చికిత్సపొంది హాయిగా వున్నాడమ్మా !

ప్రభా : (సందేహాశ్చర్యములతో) నిజంగానా డాక్టర్‌గారు !

దయా : నిజంగాక అబద్ధం యెందుకాడతాం అమ్మాయ్. ఇప్పుడే మీఅన్న బాస్కర్రావువచ్చి ఆ అమర్‌నాథుని చూడడానికి అతడున్నగదికి వెళ్ళాడుకూడాను.

ప్రభా : (ఆనందపారవశ్యంతో) ఆ ! మా అన్నయ్యకూడా వచ్చాడా! మా అమర్‌నాథ్ బ్రతికేవున్నారా ?

భాస్క : (గబగబా ప్రవేసిస్తూ) బ్రతికేవున్నాడు చెల్లాయ్ యిప్పుడే ఆ అమర్‌నాథుని చూచివచ్చాను.

ప్రభా : (సంతోషంతో అన్నాయ్! అంటూ గభాలున భాస్కరరావును కౌగిలించుకొనును)

భాస్క : (ప్రేమతో బుజ్జగిస్తూ) స్వామివారి దయామృతం మీా యిరువురిపయిని ప్రవహించగా మీాపవిత్ర ప్రణయాంకురాలు యెలా కుళ్లిపోతాయి చెల్లాయ్!

దయా : ఆదర్శదాంపత్య ప్రభావమే వీరి ప్రేమజ్యోతుల పునఃప్రజ్వలనాసికి పునాదిగాని...నా శక్తి మాత్రం యేమీకాదు నాయనా!

డాక్ట : భాస్కరరావ్! మీా తల్లిగారి పేరు...

భాస్క : (అందుకుని) అన్నపూర్ణమ్మగారండి!

దయా : సత్యవతి అని మరియొక పేరేమయినా వుందా?

ప్రభా : లేదండి స్వామి!

దయా : అయితే డాక్టర్‌గారు! యీామె ఆ అభాగినికూతురు యెలాఅవుతుందంటారు?

డాక్ట : కాకపోవచ్చునండిస్వామి! కాని యీామెమాత్రంమన ఆశ్రమంలో పుట్టినమాట వట్టిదికాదు.

(లోపల గంట మోగును)

దయా : సరే! ఆవిషయం ఆ తరువాత ఆలోచించుకుందాం భోజనంగంట మ్రోగింది లేవండి అందరు

(అందరు లేచెదరు)

(తెరపడును)

శ్రీః

# (దశమదృశ్యం)

(సర్వోదయ సమాజాశ్రమం. దయానందస్వామి ధర్మయ్యగారితో మాట్లాడుతూ వుంటారు)

దయా : అదికాదు. ధర్మయ్యగారు నేను అడిగే ప్రశ్న ? ప్రభావతి మీకు కన్నకూతురేనా ? అని

ధర్మ : మీకు ఆ సందేహం ఎందుకు కలిగింది ? స్వామి !

దయా : ఎందుకంటారా ! మీరావిషయంచెబితేగాని నేనొక శుభసందేశాన్ని వివరించడానికి వీలుండదుగనుక.

ధర్మ : కన్నకూతురు కాదుగానీ స్వామి ! ఆమెను అంతకంటే ఆప్యాయంగా చూచుకున్నాం.

దయా : చూడలేదనికాదండి ధర్మయ్యగారు ! యింతవరకు యీామె మీకు కన్నకూతురనే యెన్నో తికమకలు పడ్డాం.

ధర్మ : అలాంటి ధర్మసందేహం మీకు యెందుకు కలిగింది ? స్వామి !

దయా : ఆమాట మీకు తరువాత చెబుతాను...గాని యీామె కన్నతల్లియెవరో చెబుతారా ?

ధర్మ : కన్నతల్లియెవరో, కన్నతండ్రి యెవరో నాకు యేమీ తెలియదండి... గాని ... యీా మా పాపాయిది ఒక విచిత్ర చరిత్ర...

దయా : ఆచరిత్రే యిప్పుడు నాకు చెప్పాలి ధర్మయ్యగారు,

ధర్మ : చెప్పడానికేమండి స్వామి ! ఇప్పటికి పదునాలుగేళ్ళకు పూర్వం, ఒకనాటిరాత్రి వేకువజామున పాలబుగ్గల పసిపాప మాపీధి అరుగుమీద "కేర్ కేర్" మంటూ యేడుస్తూ పడివుండగా నేను నాభార్య నిద్రమంచా ల్నుంచి లేచివచ్చి చూశాం...అక్కడ పాపాయి తప్ప మరియెవ్వరూ లేకపోవడానికి ఆశ్చర్యపడ్డాం.

దయా : ఆశ్చర్యం కాదుమరి ! ఆ తరువాత ?

ధర్మ : తరువాత భగవంతుడు మాకు యీ బంగారు పాపా యిని ప్రసాదించి, పాపాయిలేని లోటు తీర్చాడని, పరమానంద భరితులం అయ్యామండిస్వామి !

దయా : అబ్బ ! ఇప్పటితో నాసందేహానివృత్తి అయింది ధర్మయ్యగారు.

ధర్మ : మీకుగలిగిన సందేహం యెందుకో అని మాత్రం నా సందేహం తీరలేదు. స్వామి !

దయా : (చెవిలో నెమ్మదిగా చెప్పును)

ధర్మ : (ఆనందంతో) నిజమేనా ? స్వామి !

దయా : నిజంగాక ఆధారంలేనిమాట ఆడతానా ? ధర్మయ్య గారు !

ధర్మ : (సంతోషంతో) అయితే ! మీ అనుగ్రహంవల్ల ఘోర పాపానికి గురికాకుండాతప్పి ధన్యులంఅయ్యాం స్వామి!

దయా : దైవానుగ్రహంవల్ల సత్యం బయటపడింది గనుక నే సత్యవతీదేవి శీలవతిగా, ప్రభావతి సౌభాగ్యవతిగా సువర్ణాక్షరాలతో చరిత్రలో చిత్రింపబడగలిగేను.

ధర్మ : అడగడం మరచిపోయాను శ్రీహరిరావుగారికి మీరు గణపతిగారితో కలిసి రమ్మనే కబురు పెట్టేరా ? స్వామి!

దయా : సరి! సరి! గణపతిగారితో కలిసి రాకపోతే ! శ్రీహరిరావుగారి జీవితనాటకం సుఖాంతంగా సమాప్తి కాదు గదండి ! ధర్మయ్యగారు.

ధర్మ : (చూచి) అదుగో స్వామి ! ఆ యిరువురు మీరన్న ప్రకారం కలిసే వస్తున్నారు.

శ్రీహ : (ప్రవేశించి) నమస్కారమండి స్వామీ !

గణ : (సమీపించి) స్వామివారికి శతకోటి నమస్కారాలు.

దయా : ( చేతులెత్తి ) ఆయురారోగ్యాభివృద్ధిరస్తు దయచేయండి. దయచేయండి !

శ్రీహ : ( ధర్మయ్యగారినిచూచి ) మాకంటే ముందుగా ధర్మయ్యగారే దయచేసేరు. (కూర్చొనును)

గణ : (ఆక్షేపణగా) శ్రీహరిరావుగారివంటి శ్రీమంతుల్ని చెందనాడుకోవడం శ్రేయస్సనే తలచేరా ? ధర్మయ్యగారు ! (కూర్చొనును)

శ్రీహ : (అసూయతో) ఏడుదాటి తెప్పతగలేసే యిలాంటి మనుష్యులతో వ్యవహారాలు యెలావుంటాయనుకున్నావ్ మరి ?

ధర్మ : (వ్యంగ్యంగా) ధర్మపన్నాలు చెప్పేవారే ప్రపంచంలో యెక్కువగా దారుణకృత్యాలుచేస్తారు.

శ్రీహ : (కోపంతో) ఏమిటి ? ధర్మయ్యగారు ! మీరన్న ధర్మసూక్తి . . .

ధర్మ : ఏఁవుంది ? వున్నమాటే అన్నాను.

గణ : ఏఁవిటావున్న మాట ? ధర్మయ్యగారు.

శ్రీహ : ఏఁవిటంటావా ? మొదట నాకిచ్చి పెళ్ళిచేస్తానన్న తన కూతుర్ని యీ ఆశ్రమంలోవుంచి, మనకు మసి పూసి మారేడుగాయచేయడమే.

గణ : మాయచేయడానికి మీకు వ్రాయించియిచ్చిన శుభలేఖ కూడా మాదికాదంటారా ?

శ్రీహ : ఆ ఆధారమే మనకు లేకపోతే ! పాతికవేల రూపాయలకు పరువునష్టందావా వేయడానికి మనకు దారి కూడా లేకపోయేదేగా ?

ధర్మ : మీవ్యవహారం పరువునష్టందావావరకుకూడా వచ్చిందన్నమాట !

గణ : రాక ? ఇరువదివేల రూపాయలనోటుబాకీ, అరవయి కాసులబంగారం మీపరంచేసి "రెండిటికి చెడ్డరేవళ్ళ"ముయి నోరుమూసుకుని వూరుకుంటామనుకున్నారా ?

శ్రీహ : (ఊసడింపుతో) ఆనాడు నాకు అరచేతిలో వైకుంఠం చూపించి మీపని మీకయ్యాక పెళ్ళికూతురు కనబడ లేదనడమేనా ? మీపెద్దమనిషితనం ? ధర్మయ్యగారు !

దయా : చినుకూ చినుకు గాలివాన చేసుకోవడమేగానీ, గతించిన పనులగురించి కాదన్ని, అవునని కలహంపెట్టుకుని కలిసివచ్చేది యేఁవీ లేదు.

శ్రీహ : సరే స్వామి ! పెళ్ళికూతురు మీఆశ్రంలోవుండి రమ్మని మీరు మాకు కబురుచేసేరుగనుక . . .

గణ : ముందు జరగవలసిన వివాహ కార్యక్రమాన్ని సక్రమంగా మీ చేతుల్తో చేయించే బాధ్యతమాత్రం మీది.

దయా : బాధ్యత కేంగాని ! ధర్మంప్రకారం వివాహం మా ఆశ్రమంలో జరిపించడానికి మా అభ్యంతరం యేఁవీ వుండదు.

శ్రీహ : సంతోషంస్వామి! మీ చేతుల్తో నన్నొకగృహస్థుణ్ణి చేయడంకంటే నాకేంకావాలి ?

దయా : శ్రీహరిరావుగారూ! యిప్పుడు కొన్ని నా మాటలకు మీరు సరిఅయిన సమాధానం యిస్తారా ?

శ్రీహ : ఇవ్వడాని కేమండి భగవంతుని సాక్షిగా ప్రమాణం చేసి మరీయిస్తాను అడగండి స్వామి !

దయా : పదునాలు కేళ్ళకు పూర్వ మీయింట్లో సత్యవతి అనే అమ్మాయి కొన్నాళ్ళు వున్నట్లు మీకు జ్ఞాపకం యేమయినా వుందాండి ?

శ్రీహ : (కొంచెం కంగారుపడి తమాయించుకుని) జ్ఞాపకం లేకేమండి కొన్నాళ్ళు కాదు కొన్ని యేళ్ళు వుందిస్వామి!

దయా : ఉంటే ఆమె గుణశీలా లెలాంటివో మీకు బాగా గుర్తున్నావా ? రావుగారు.

శ్రీహ : (ఇంకా కంగారుపడి తికమకలుపడును)

గణ : (అందుకుని) ఆమె వీరియింటనుండే రోజుల్లో శీలవతి గానే కాలక్షేపం చేసింది స్వామి !

దయా : ఆమెను రావుగా రేమయినా పరిణయం ఆడడానికి ప్రయత్నం చేశారా ?

గణ : చేసినమాట సత్యమేగానండి స్వామి ! యేల్నాటిశని యేదో వుండి, వీరికి పాపం ఆమెను పెళ్ళిచేసుకోవ డానికి వీలయింది కాదులెండి !

దయా : వీలుకాలేదని, ఆమె వీరియిష్టంమీాదే వెళ్ళిపోయిం దంటారా ? యెక్కడికయినా !

శ్రీహ : (తటపటాయిస్తూ) చిత్తంస్వామి !

దయా : ఎక్కడికి వెళ్ళిపోయిందో మీారు యేమయినా చెప్ప గలరా ?

గణ : పుట్టింటికే పోయివుంటుందని వూహించాం కాని... అక్కడికి కూడా వెళ్ళలేదని విని చాలా విచారించాం.

భాస్క : (గబాలున ప్రవేశించి క్రోధంతో) విచారించారు ఆసాధ్వీమణి జీవితవృత్తాన్ని కూకటి వేళ్ళతో కూల ద్రోచి మీారు చాలవిచారించారు. అర్థబలంగల మనం యేంచేసినా చెల్లించుకోగలమని కండకావరంతో కళ్లు నెత్తికెక్కి, ఆత్మద్రోహం, వంశద్రోహం, సంఘ ద్రోహం కూడాచేసి మానవజాతికే చీడపురుగులమయి పుట్టేమన్నమాట మరచిపోయి యింకా మనుష్యుల మనుకునే మీారు యీా స్వామివారియెదుట మాట్లాడు తున్నారా ?

శ్రీహ : (బుకాయింపుతో) ఏం ? ఏంవిటి నీవాగుడు మను ష్యులంగాక ప్రాణుల మనుకున్నావా?

భాస్క : (ఆవేశంతో) కళ్లు పొరలుగ్రమ్మి అరిషడ్వర్గాన్ని అరికట్టుకోలేక అన్నం పున్నెం యెరుగని ఆ సత్యవతీ

దేవికి చేసిన మహాద్రోహానికి తోడు! కన్నకూతుర్నే కామించి పెళ్లి చేసుకోవాలని తలచిన యీ శ్రీహరి రావుగారు మానవ జన్మమెత్తి నేయి అన్నంతినే మనుష్యుల్లో, గడ్డిగాదరాతినే పశువుల్లో మీరు చెప్పండి స్వామి!

గణ : (తడబడుతూ) అలా అసంబద్ధంగా మాట్లాడ్డం అన్యాయం.

భాస్క : (ఇంకా ఆవేశంగా) కాదుమరి! దేవాలయానికి గుమస్తాగిరిచేస్తూ "చెప్పేవి శ్రీరంగనీతులు దూరేవి దొమ్మరిగుడిసెలూ" అనే సామ్యంగా సంచరిస్తూ పైమెరుగు మాటల్తో ప్రజల్ని మోసగిస్తూ నీతి నిజాయతీల్తో నిమిత్తం లేకుండా బ్రతుకుతూవుండే యీ గణపతిని పయోముఖవిషకుంభ మనాలో, గోముఖ వ్యాఘ్రమనాలో కొంచెం చెప్పండి స్వామి!

దయా : ఆగు నాయనా! అగ్గిమీద గుగ్గిలంలా అలా మండి పడుతూ అప్పుడే అంత వుషుకు జుట్టుకుంటా వెందుకు?

శ్రీహ : (నిర్ఘాంతపోయి) ఏమిటండి స్వామి? ఈగంద్రగోళం అంతా? అయోమయంగావుందినాకు?

దయా : తినబోతూ రుచి అడగడం యెందుకండి! ఇంకొక నిమిషంలో విషయం మీ చెవులారా వింటారు. (బిగ్గరగా) డాక్టర్ గారు డాక్టర్ గారు! యింకా మీకు ఆ కవరు కన్పించలేదా?

డాక్టరు : (లోపల్నుంచి) కనిపించిందిస్వామి (అంటూ ప్రవేశించి) ఇదిగోనండి ! (కవరీయబోవును)

దయా : డాక్టర్ గారు ! మీరే దానిలోని విషయం ఆమూలా గ్రంగా చదివి, మాకందరికి వివరంగా వినిపించండి.

డాక్టరు : చిత్తంస్వామి ! (కాగితంతీసిచదువును) శ్రీపరబ్రహ్మ స్వరూపులయిన స్వామివారి దివ్యసముఖానికి మీ శిష్యురాలు చందనం సత్యవతి వందనంబులతో వ్రాసు మను విజ్ఞాపనం. మహాశయ ! ప్రత్యక్షంగా నా కన్నీటిగాధను మీకు విన్నవించుకును సాహసంలేక, పరోక్షంగా నాయీలేఖద్వారా తెలియజేసుకును చున్నందుకు క్షమింపప్రార్థన.

నేను పుష్పగిరి వాస్తవ్యులు జానకీదామోదరులను పుణ్యాదంపతులకుబుట్టిన అభాగ్యురాలను. శ్రీహరి రావుగారి రెండవభార్య గౌరీదేవికి చిన్నతనంనుంచి చెలికత్తెగా వుంటూ ఆమె అత్తవారింటికి వచ్చి నప్పుడు ఆమెతో నేనుకూడా శ్రీపురం రావుగారి యింటికివచ్చి ఉండిపోయాను. పాపంగౌరీదేవి కట్నం తేలేదనే కారణంగా, రావుగారి క్రోధాగ్నికి మిడత అయి కాలవాహినిలో కలిసిపోయినా, నేనుశ్రీవారి మాయామోహితురాలనయి మాయింటికి వెళ్ళలేక పోయాను. రజస్వల నయియున్న నన్నుచూచి రావు గారు నే నెంతకాదని మొత్తుకున్నా, నాకళ్ళుగప్పి

పెళ్ళాడతానని, నా శీలాన్ని చెడగొట్టేరు. చివరకు గర్భవతినయ్యాక పెళ్ళాడమని నేనెంత యేడ్చినా విని పించుకోక, పుట్టింటికిపొమ్మని లేకపోతే ప్రాణాలు తీస్తానని పరవళ్ళుత్రొక్కేరు. కసాయివాని కాలిక్రింద మేకపిల్లలా గడగడ లాడిపోయాను. గత్యంతరం లేక పోయింది. ఆరాత్రి కన్ను పొడుచుకున్నా కనిపించని కారు చీకట్లో, ఎవరికంటా పడకుండా వూరుదాటి వెళ్ళిపోయాను. ఎనిమిదిమాసాలు అజ్ఞాతవాసంచేసి రైతుబాబుల సహాయంతో మీ ఆశ్రమం చేరు కున్నాను. ఆనాటి నా అసహాయస్థితిలో ఆదుకుని మీరు డాక్టరుగారు నాకుచేసిన మహూపకారానికి జన్మజన్మకు కృతజ్ఞురాలనయి వుంటాను. నాకడుపు పంట అయిన పాపాయి నాలాదురదృష్టవంతురాలు కాక, యెప్పటికయినా మీ కంటబడితే పలానా చందనం శ్రీహరిరావుగారి వంశాంకుర అనిమాత్రం వెల్లడించి నన్ను శీలవతిగాచేసి భారత నారీమణుల ప్రఖ్యాతిని కాపాడండి. ఆనాడుగాని నాఆత్మకు శాంతి చేకూరదు శెలవ్. ఇట్లు, మీ విధేయురాలు చందనం సత్యవతివ్రాలు.

దమా : శ్రీహరిరావుగారూ ! మా డాక్టర్ గారు చదివి విని పించిన లేఖ మీరు సాంతంగా విన్నారుగా ?

(శ్రీహరిరావు, గణపతులు గడగడా వణికిపోతూ యేమీ మాటాడరు)

దయా : (బిగ్గరగా) ప్రభావతి! ఓ ప్రభావతి! (అని పిలచును)

ప్రభా : (ప్రవేశించి) నమస్కారమండి స్వామి!

దయా : ప్రభావతి! చూడు! మీనాన్నగారు వచ్చారు వారికి నమస్కరించు. ఆశీర్వాదిస్తారు.

ప్రభా : (ధర్మయ్యగారికి నమస్కరింపబోవును)

డాక్ట : వారికి కాదమ్మా! (శ్రీహరిరావును కనపరచి) వీరికి.

దయా : అవునమ్మా! వీరే నీకన్నతండ్రిగారు.

ప్రభా : (తెల్లబోయి ధర్మయ్యగారివంక చూచును)

ధర్మ : అవునమ్మా! నేను నీ పెంపుడుతండ్రిని.

భాస్క : స్వాములవారు చెప్పినట్లు నిన్నుగన్నవారు వీరే చెల్లాయ్!

ప్రభా : (శ్రీహరిరావుగారివైపుకు బెదరుతూ చూచును)

శ్రీహ : (చేతులుచాచి) అవునమ్మా! దౌర్భాగ్యుడనయిన నేనే నీ కన్నతండ్రిని.

ప్రభా : (చేతులు జోడించి) నా ..న్న...గా...రు.

(అంటూదగ్గరకు వెళ్ళును)

శ్రీహ : (తల్లీ అంటూ కౌగలించుకొనును)

ధర్మ : (ఆనందంతో) నేడు యెంతసుదినం స్వామి!

డాక్ట : మీకేకాదు భారతీయుడన్న ప్రతివానికి నేడు పర్వదినమని చెప్పాలి.

శ్రీహ : (దయానందస్వామి కాళ్ళపయిపడి లేచి మోకాళ్ళ మీద కూర్చొని, కన్నీరు కారుస్తూ గద్గదస్వరంతో)

స్వామి! ఆత్మాదురభిమానంతో యింతవరకు నాకత్తికి యెదురులేదని యెన్నెన్నో చేయరాని పాపాలుచేశాను అందుకు నాపాపిష్ఠిముఖాన్ని చూచినవారికి పంచమహా పాపాలు పట్టుకుంటాయ్. ధనమే సర్వం అనుకుని దారుణంగా పీనుగులమీదకూడు తీసుకుతిన్న నాతో మాట్లాడినవారు కుంభీనరకపాపంలోపడి కుమిలి పోతారు. దుర్వ్యసన ప్రవాహంలో కొట్టుకునిపోతూ, ఆనువంశికమర్యాదల్ని అగ్గిపాలుచేసుకున్న నన్ను ముట్టుకున్నవారు అంటరానివారు అయిపోతారు. అందుకు నావంటి పరమద్రోహి ప్రపంచంలో బ్రతికి వుండకూడదు. నిజంగా నా నికృష్టజీవితానికి నివృత్తి మరణంకంటే శరణ్యాం మరివొకటిలేదు. (వూరంగా వచ్చి మొలలోని బాకుతీసుకొని పొడుచుకొనబోవును)

అమర్ : (గభాలున తలకుకట్టిన గుడ్డకట్టుతో వెనకబాటున వచ్చి శ్రీహరిరావుగారి చేతిలోని బాకు లాక్కొని దూరంగా గిరటవైచి) ఏమిటి? మహారాజ! మీ సాహసకృత్యం? చివరికి మంచిపని చేస్తున్నారు.

శ్రీహ : (అమర్‌నాథుని వెఱ్ఱిగాచూచి) ఎవరవు బాబునువ్వు! మా అమర్‌నాథ్‌వేనా? నిన్ను యెవరు బ్రతికించారు నాయనా! దేవతామూర్తివని తెలుసుకోలేక నీ లేత హృదయానికి అనేక ఆఘుతాలు కలిగించాను. నిన్ను చంపి, నీ ఆస్తిని అపహరించాలనికూడా అనేక కుతం

త్రాలు చేశాను. వానికి ప్రతిఫలంగా నువ్వు యివ్వాడు నన్ను క్షమించడం సరియయిందికాదు. నీచేతుల్తో నన్ను పొడిచి చంపి నాబోటి కృతఘ్నులికి గుణపాఠం నేర్పాలిగాని, బాకు నావలపార వేయడం పొరపాటు. (తలనాడించి) అవును. నువ్వు ధర్మప్రవర్తనలో దైవ మున్నదను ధర్మమూర్తివి...సత్యం జయతి అను సన్మార్గగామిని...చీమనుసహితం త్రొక్కని అహింసా వాదివి. గాని...నాలా తల్లీ పిల్లా అనే తారతమ్యం తెలుసుకోలేని ధర్మబాహ్యుడవుకావు. నా లా ప్రక్కింటివారు పస్తులుండడంచూస్తూ బదులుకూడా పెట్టని పరమలోభివికావు. చాలా స్వార్థాంతతతో స్వజనుల్నిసహితం హింసించే ఘాతుక మృగానివికావు. నాలా పొదుగుకోసి, పాలుత్రాగే పోకిరీవాడవుకావు. (చేతులు పట్టుకొని) ఇవి చేతులుకావు నాయనా! కాళ్ళు. నన్ను క్షమించావనవూ? (ధర్మయ్యగారి కాళ్ళుపట్టుకొని) ధర్మయ్యగారు! మీ కుటుంబగౌర వాన్ని అర్థంచేసుకోలేక వ్యర్థంగా మీమీద అనేక అపవాదులు వేశాను. వానికిమీరు అన్యథా భావిం చక, మన్నించానని మాటయివ్వరూ? (భాస్కర రావు చేతులు పట్టుకుని) భాస్కర్రావ్! పసితనం నుంచి నిష్కామ్యబుద్ధితో విశాలదృక్పథంతో దేశా నికి, గ్రామానికి, సంఘానికి మనోవాక్కాయ కర్మ

లతో చేసే నీసేవనుచూచి కళ్ళల్లో నిప్పులు పోసు కున్నాను. కాని...నువ్వుమాత్రం కార్యశూరుడవయి మార్గదర్శకుడవయ్యావ్! నువ్వుకూడా నాపయి జాలి పడి దయచూపవూ? (ఆకాశంవంక చూచి) అదిగో! నాహృదయమందిరానికి వేసిన చీకటితలుపుల్ని తన వెలుగుచేతులతో తెరవాలని ప్రయత్నించిన ప్రణయాధిదేవత సాధ్వీమతల్లి సత్యవతీదేవి ఆకాశంనుంచి చూస్తూ వలపురోగంతో నేను వాడలు తెలియకతనకు చేసిన ద్రోహానికి అసహ్యాసపడుతూ మీరందరూ క్షమించినా తానుమాత్రం క్షమించనంటూ శపిస్తూన్నది... అవును తన వ్యక్తిత్వాన్ని నాస్వార్థంకోసం అడవి బూసిన పూవున్లా వ్యర్థంచేసిన నాకు శాస్తి కావాలని శపింపక సహించగలదా? అమృతభాండాన్ని హాలాహాలభాండమని అనుమానించి కాలతన్ని నేలపాలు చేసిన తెలివిమాలినవానిలా సత్యవతీ! నీచూపుల్లోని స్వర్గీయానందాన్ని చూరగొని, రాగరసరాజ్యానికి రాణిని చేసుకోలేని దౌర్భాగ్య దామోదర చక్రవర్తి నని వికటాట్టహాసంచేస్తున్నావా? యింకా నీమాంసాన్ని కుక్కలు తినవని, నీరక్తాన్ని కాకులు ముట్టవని నిన్ను నిలువునా ప్రాణాలతో పాతిపెట్టినా తగలబెట్టినా పాపం వుండదనికదూ? తిడుతున్నావ్? (బెట్టినవ్వునవ్వి) అభము శుభమూ యెరుగని ఆడవాళ్ళకి అన్యా

యంచేసిన నాబోటి మానవాకార దానవుణ్ణి మరీమరి తిట్టాలి అప్పుడుగాని నీ అక్కసు తీరదు. (చేతులు పైకెత్తి) సత్యవతీ! సత్యవతి! నీకాళ్ళుపట్టుకొని క్షమాభిక్ష పెట్టమని కోరడానికి ఇదిగో! నేనుకూడా నీవద్దకు వస్తున్నా (అంటూ పైకి యెగిరి క్రిందపడి పోవును)

: (గభాలునవెళ్లి లేవదీసి) శ్రీహరిరావుగారూ! పరిస్థితులకులోంగి తెలియక తప్పులుచేసినా! తెలుసుకుని సరిదిద్దుకోవాలిగానీ గడచిపోయినదానికి వగచి కలిసిరాదు.

(వణకుతూ స్వామికి నమస్కరించి) స్వామి వెన్న లాంటి శ్రీహరిరావుగారి మనస్సును యెప్పటికప్పుడు నా స్వార్థానికయి మచ్చుమందులాంటి మాటలు చెబుతూ మార్పు కలిగిస్తూ దుర్మార్గాలు చేయడానికి దోహదంచేస్తూ వచ్చిన దుర్మార్గుణ్ణి నేను. మొదట నాకూతుర్ని కట్టబెట్టాలనేకాంక్షతో రావుగారికి యేల్నాటిశని వుందని, యేడేళ్ళు దాటితేగాని వివాహం చేసుకోవడానికి వీలులేదని, మాయాజ్యోతిష్కునితో చెప్పించి, సత్యవతీదేవి కాపురానికి చిచ్చుపెట్టిన చండాలుణ్ణినేను. ఆదర్శమూర్తి అయిన అమర్ నాథునిమీద అపవాదులుమోపి రావుగారికి కోపం తెప్పించి కొట్టించడమేకాకుండా డాక్టర్‌గారికి లంచ

మిచ్చి చంపించాలనికూడా ప్రయత్నించిన పాపాత్ముణ్ణి నేను. యీ ప్రభావతి రావుగారిని పెళ్ళిచేసుకోనని నిరాకరించినా యీ ధర్మయ్యగారికి మాయమాటలు చెప్పి ఒప్పించిన మహాద్రోహినినేను. అంతేగాని యీ రావుగారుమాత్రం బుద్ధిపూర్వకంగాచేసినమోసం యేదీలేదు. అందుకు నాపాపానికి ప్రాయశ్చిత్తంగా నాప్రాణాలు బలిచేయవలసినవాడనునేను (బాకుతీసి కొని పొడుచుకోనబోవును)

భాస్క : (గణపతిచేతిలోని బాకు లాక్కొని) గణపతిగారు! మీకర్తవ్య నిర్వాహణం ప్రస్తుతం యిది కాదండి! యింతవరకు శ్రీహరిరావుగారితో చెడుపనులు చేయిం చిన మీరు యికనుంచి మంచిపనులు చేయించడం మీ యిరువురికి యిహపరశ్రేయోదాయకం.

దయా : అవును. పశ్చాత్తాప జలాల్తో మీ హృదయమాలి న్యాల్ని ప్రక్షాళనం చేసుకుని మీ మనఃప్రవృత్తుల్ని మార్చుకోండి. సత్కార్యాల్నిచేసి మీపాపాల్ని పరి హరించుకోండి. అంతేగాని బలవంతంగా ప్రాణాలు తీసు కుంటే! భగవంతుడు మెచ్చుకుంటాడా? శ్రీహరి రావుగారూ! సత్యవతీదేవి ఆత్మకు శాంతి చేకూర్చా లనే సంకల్పం మీకువుంటే సంతోషంగా ఆమె కుమార్తెను మీ మేనల్లునకిచ్చి పాణిగ్రహణం చేయిం చండి. యింకా ఆ సత్యవతీదేవి పేరు చిరస్థాయిగా

వుండేలా ఆమె పేరిట ఒక అనాథ శరణాలయాన్ని నిర్మించండి. అది మీా కర్తవ్యం.

శ్రీహ : చిత్తం స్వామి ! మీా ఆజ్ఞ ప్రకారం అమర్‌నాథ్ ఆస్తి అమర్‌నాథ్‌కిచ్చి పాణిగ్రహణం చేయిస్తాను. నా స్వంత ఆస్తి అమ్మి మీా ఆశ్రమంలోనే అనాథశరణాలయం కట్టించి నా జీవిత శేషాన్ని ఈ శరణాలయ సేవ లోనే గడుపుకుంటాను.

గణ : నేనుకూడా నా ఆస్తిలో సగం అమ్మి ఆడబ్బు ఈఅనాథ శరణాలయానికే యిచ్చి రావుగారితో యిచటే వుండి పోతాను స్వామి !

దయా : తథాస్తు !!

ధర్మ : "శుభస్య శీఘ్రం" అని ప్రభావతీ అమర్‌నాథుల పాణి గ్రహణమహోత్సం యిప్పుడే జరిపించండి. స్వామి !

శ్రీహ : (సంతోషంగా ప్రభావతి చేతిని అమర్‌నాథ్ చేతిలో పెట్టును.)

(ప్రభావతీ అమర్‌నాథ్‌లు స్వామికి నమస్కరింతురు.)

దయా : (చేతులెత్తి)

సీ॥ విమల స్వరూపంబు విశ్వసామ్రాజ్యంబు
భవవర్తనంబు భూపాలనంబు
శత్రుషడ్వర్గంబు శత్రురాడ్వర్గంబు
సిద్ధశక్తుండు మరుడనే నియంత
అన్యోన్యసుస్మిత హాసముల్ సప్తాంగ
ములు నవయౌవనము ఘనకోశ

మాహాలు చట్టంబు లుజ్వలాలాపంబు
కానుక చూడ్కులు ఖడ్గవితతి
తే॥ వీరలకు నవదంపతులార ! మీరు
ప్రణయ రాజ్యైక పాలనా బద్ధులగుచు
స్వహిత పరహితముల సమత్వముగఁదలఁచి
దేశకళ్యాణ కరకార్య దీక్షమనుఁడు॥

(ప్రభావతీ అమర్‌నాథులు శ్రీహరిరావుగారికి
ధర్మయ్యగారికి నమస్కరింతురు.
వారిరువురు ఆశీర్వదింతురు)
(అందరు నిష్క్రమింతురు.)
(తెర పడును.)

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

— సమాప్తం —



# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | | భారతవందనం హృగాయాం — హృదయాం. | |
| 3 | 25 | మతోన్మది | మఠోన్మది |
| 10 | 15 | బాబ్బాయి | బాబాబ్బాబు |
| 11 | 19 | ఎందుకుకేవిటండి | ఎందుకేఁవిటండి ? |
| 13 | 16 | గలిగేరు | కలిగేరు? |
| 14 | 19 | మాదానికి | మోదానికి |
| 16 | 22 | వావానికి | వాదానికి. |
| 17 | 20 | కన్నను | కన్నెను |
| 18 | 4 | కన్నత్వాన్ని | కన్యత్వాన్ని |
| 18 | 11 | విరాసానికి | విలాసాలికి |
| 19 | 11 | ఇతమిత్థ | ఇదమిత్థ |
| 19 | 13 | వుంవండి | వుంది ? |
| 19 | 19 | శాగుతూ | సాగుతూ |
| 22 | 17 | ప్రభోధం | ప్రబోదం |
| 24 | 20 | రాద్ధాంతాయి | రాద్ధాంతాలు |
| 25 | 8 | ఆదివాదం | ఆదివారం |
| 26 | 16 | నిన్ను | నన్ను |
| 27 | 14 | పిచిచ్చి | పిచ్చి. |
| 28 | 7 | విదిలే | వదితే. |
| 30 | 10 | శర్వ | సర్వ |
| 30 | 13 | విస్మరింప | విస్మరింపగ |
| 30 | 14 | పరేంగిప | పరేంగిత |

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 30 | 22 | స్పృశ్య | స్పృస్య |
| 31 | 6 | జకనీ | జననీ |
| 31 | 11 | బలపరచు | బచరించు |
| 31 | 17 | భారప | భారత |
| 32 | 22 | నందెంచు | నందుంచు |
| 34 | 12 | విషాన | విషాద |
| 35 | 10 | సముగమన | సహాగమన |
| 35 | 10 | దురాచాద | దురాచార |
| 43 | 9 | కన్నము | కన్నమును. |
| 43 | 10 | మేసి | మేపి |
| 44 | 14 | గమనానికి | గమనానికి |
| 45 | 17 | స్వత్వవర్తం | స్వస్వవర్తనం |
| 46 | 21 | తఅం | అంత. |
| 48 | 17 | ప్రమానికే | మాత్రానికే |
| 49 | 13 | లేదనన | లేదననని |
| 56 | 2 | తప్పక | తప్ప. |
| 56 | 16 | బ్రహ్మాంమంగా | బ్రహ్మాండంగా |
| 60 | 17 | చెప్పేవున్నీ | చెప్పేవన్నీ |
| 61 | 14 | కంఠు........ పెట్టేగా | డారివాని కొంపలా తయారుచేయడం |
| 62 | 4 | గూళ్ల | గుళ్ల |
| 62 | 19 | విజృంభిగుదూ | విజృంభిగుతూ |

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 63 | 12 | మూడగట్టు | మూటకట్టు |
| 63 | 14 | చేయలి | చేయాలి |
| 63 | 15 | పురాణ | పురాణం |
| 64 | 5 | దూమారం | దుమారం |
| 64 | 11 | అవ్రాతు | అవుతూ |
| 64 | 17 | యీాతో | మీతో |
| 67 | 4 | కాల్లో-కల్లో | కాల్లోకల్లో |
| 67 | 9 | మన్మ్రల్ని | మనుష్యల్ని |
| 68 | 11 | బాధ్యతల | బాధ్యతలుగల |
| 71 | 17 | కునకా | కులకా |
| 71 | 20 | వీచిలోమూ | వీధిలోనూ |
| 72 | 7 | వివాహాక | వివాహం |
| 72 | 14 | అబధ | అబద్ధం |
| 75 | 17 | దేవాతా | దేవతా |
| 80 | 5 | తమరు. | తమదు. |
| 83 | 21 | కుదలేదా | కుదరలేదా ? |
| 86 | 18 | పొట్టనింపే | పెట్టెల్నింపే |
| 87 | 18 | నాకే | నీకే |
| 90 | 19 | గంతలా | గతంలా |
| 93 | 15 | కానమానడు | కాకమానడు |
| 95 | 9 | శ్రీహా........ | శ్రీహా........కాదంటే? |
| 98 | 6 | నీదన | నీదను |

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 98 | 22 | అభిప్రాయన్ని | అభిప్రాయాన్ని |
| 101 | 11 | శిష్టాయమ | శిష్టామయ |
| 102 | 5 | నన్న | నన్ను |
| 103 | 21 | దేముడి | దేముంది ? |
| 104 | 11 | ఇవ్వడాని | ఇవ్వడానికి |
| 104 | 22 | భిక్షుధి | భిక్షాధి |
| 105 | 23 | పోదా | పోతా. |
| 107 | 20 | పిలిపింకే | పిలిపించకే |
| 114 | 5 | వించిదని | వించిందని |
| 123 | 23 | ఆశ్రంలో | ఆశ్రమంలో |
| 124 | 11 | భనవంతుని | భగవంతుని |
| 124 | 19 | గుర్తున్నా వా | గుర్తున్న వా ? |
| 125 | 20 | నున్నారా | తున్నారా ? |
| 127 | 22 | రజస్యల | రజస్వల |
| 128 | 12 | వహాప | మహోప |
| 130 | 22 | అఘుతాలు | అఘాతాలు |
| 131 | 8 | గా మిని | గామివి |
| 131 | 12 | చాలా | వాలా |
| 134 | 17 | చేన | చేసి. |

అట్టమీద అస్పృశ్యత నిర్వహణ — అస్పృశ్యతా నివారణ